# పరాశరసంహితా
# ఆంజనేయ చరిత్ర



**✻ శ్రీపరాశరసంహితా ✻**

# శ్రీ ఆంజనేయచరిత్ర

## ఏకాదశ పారిజాతము



సమర్పణ :

'సాహిత్య విద్యాప్రవీణ,'
'వైద్యవిద్వాన్', 'భాషాప్రవీణ', 'హిందీవిశారద'
శ్రీ అన్నదానం చిదంబరశాస్త్రి,
M. A. & M. A. P. O. L

ప్రచురణ :
**శ్రీ హనుమత్సేవా సమితి**
సత్యనారాయణపురం : విజయవాడ-520 011.

శ్రీ రౌద్రి - వైశాఖము
9-5-1980 శ్రీ హనుమజ్జయంతి.

రు. 8-00

శ్రీరామరక్ష - సర్వజగద్రక్ష
ఆంజనేయరక్ష - అఖిలజగద్రక్ష

ముద్రణ :
తిరుమల ఆర్ట్సు ప్రింటర్సు,
విజయవాడ-2.



ఈ రూపు నీయఁ గని నా
కీ రీతిగ హనుమ నెంచు నింగిత మిదు సీ
తా రామాంబా లక్ష్మీ
నారాయణులన్ పితరుల నమములఁ గొలుతున్.

— అన్నదానం చిదంబరశాస్త్రి.

## —: విషయ సూచిక :—

ఓం

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ హనుమత్సీతా లక్ష్మణ భరత శత్రుఘ్నపరివారసమేత

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః

శ్రీ వేంకటేశాయ నమః

# శ్రీ ఆంజనేయ చరిత్ర

[ శ్రీ పరాశర సంహితా ]

ఏకపంచాశ త్పటలః

## పురుషమృగాహరణోపాయ కథనం

[పూర్వవృత్తాంతము:- పూర్వము ధర్మరాజు సుఖ శాంతులతో రాజ్యము పాలించుచు ఒకప్పుడు రాజసూయ యాగము చేయ మొదలిడెను. ఆ యాగ సందర్భమున ఆతడు అనన్య సామాన్యమైన సంతర్పణము చేయసాగెను. పురుష మృగ సంచారము వలన భోజనశాల ఎల్లప్పుడు పరిశుద్ధముగా నుండును. దేవలోకమునుండి పురుష మృగమును తెచ్చుటకై భీముడు బయలుదేరెను. త్రోవలో హనుమంతుడు భీముని శక్తిని పరీక్షింపగోరి అడ్డునిలచెను. బలగర్వమణగిన భీముడు హనుమంతుని ప్రస్తుతించగా ఆతడు ప్రసన్నుడయ్యెను.]

శ్రీ పరాశరః :—

శ్లో॥ అథాబ్రవీ త్కపి శ్రేష్ఠః భీమం భీమపరాక్రమం
సౌమ్యరూపం సమాస్థాయ ప్రహసన్ముఖపంకజః॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు :- ఓ మైత్రేయా! పురుష మృగమును తీసికొని రానెంచి బయలు దేరిన భీముఁడు తనమార్గమును నిరోధించి తన బలగర్వము పోగొట్టిన హనుమంతుని స్తుతించగా, హనుమంతుఁడు తన ముఖపద్మమున చిరునవ్వు చిందులాడ సౌమ్యరూపముఁబొంది భయంకర పరాక్రమముకల భీమునితో నిట్లనెను :

శ్లో॥ విద్ధి మా మంజనాపుత్రం హనుమన్త మితి శ్రుతం
వాయుపుత్రతయా చాహం భ్రాతా తే నృపనందన॥

తా॥ ఓ రాజకుమారా! భీమసేనా! నన్ను అంజనా సుతుఁడగు హనుమంతునిగా నెఱుగుము. వాయుపుత్రుఁడ నగుటచే నేను నీకు సోదరుఁడను.

శ్లో॥ ఇదం తే సాహసం జ్ఞాత్వా పుంమృగాదానగోచరం
అహ మాసం సమాసీనో భ్రాతృస్నేహేన విక్లబః॥

తా॥ పురుషమృగమును తెచ్చుటకు జూచు నీ యీ సాహసము నెరిగి సోదర ప్రేమవలన శిలతఁజెంది ఇచ్చట కూర్చుని యుంటిని.

శ్లో॥ జితచేతో జవ శ్శూరః పుంమృగః పురుషాశనః
క్షణాత్పరార్థ మధ్వాన మయతి స్వాన్తపూర్వగః॥

తా॥ మనోవేగమున జయించినట్టియు, పరాక్రమము కలిగినట్టియు, పురుషులే ఆహారముగా కలదియునగు పురుష మృగము మనస్సుకంటెను ముందుగా క్షణములో మార్గము నతిక్రమించగలదు.

శ్లో॥ కో వా మమాగ్రత స్తిష్ఠే న్మర్త్యో వా దానవాపి వా
ధృతః ప్రాణానిలః కాలో నస్థాతుమితి తన్మతిః ॥

తా॥ నా ఎదుట ఎవరు నిలువగలరు? మనుష్యులు కాని, రాక్షసులుకాని, యముడైనను ప్రాణములతో నిలువ లేరని ఆ పురుషమృగపు అభిప్రాయము.

శ్లో॥ తాదృశం మృగ మానేతు మీదృశ స్త్వం కథం క్షమః?
అగృహీత్వా మహాశూరం పుంమృగం పురుషాదనం॥
న రోచతే పున ర్యానం మద్భ్రాత ర్భీమ సేన తే

తా॥ అటువంటి మృగమును తీసికొనివచ్చుటకు ఇట్టి నీ వెట్లు సమర్థుడవు? ఓ నా సోదరా! భీమా! పరాక్రమముకలది, పురుషులే ఆహారముగా గలదియగు పురుషమృగమును నా సోదరుడవగు నీవు తీసికొనకుండ తిరిగి వెళ్ళుట ఇష్టముకాదు.

శ్లో॥ కిన్తు యోగం త మాదాతు ముపదేక్ష్యామి తేఽనఘ!
స పుంమృగ శ్శుభాచారః శివపూజా పరాయణః ॥
ప్రాణాత్యయేఽపి సంప్రాప్తే న జహాతి శివార్చనమ్

తా॥ ఓసోదరా! అయినను అట్టిదానిని తెచ్చుటకు ఉపాయము చూపుదును. ఆ పురుషమృగము శుభప్రదమగు

ఆచారముకలది. ఎల్లప్పుడు శివపూజ నొనర్చునది. ప్రాణా పాయము సంభవించినను శివపూజమాత్రము వీడదు.

శ్లో॥ తత్రాపి పురతః పశ్యే చ్ఛివలింగం శుభాలయం
తదసంపూజ్య పూజార్థం పద మేకం న గచ్ఛతి ॥

తా॥ ఇంకను ఎక్కడైనను శివలింగముకల శుభప్రద మగు దేవళము ఎదురుగ కానవచ్చినచో పూజార్థముగు దానిని పూజింపక ఒక్క అడుగైన వేయదు.

శ్లో॥ మమ వాలాగ్ర రోమాణి పథి క్షిప విభాగశః
తదాలయాం సమార్చ్యైష శివలింగం చ తత్క్షణం ॥

తా॥ నాతోకచివరి వెంట్రుకలను మార్గమున విడి విడిగా వదలుము. అట్లు వదలబడిన రోమములు శివలింగము లుగామారి వాటిపై ఆలయములుగాకూడా మారును. అప్పుడు ఆ ఆలయములను అచ్చటి శివలింగములను ఆ మృగము పూజించును.

శ్లో॥ అత స్తద్గతి విఘ్నోఽయం శివలింగమయాని మే
గృహాణ వాలరోమాణి సమగ్రాణ్యాగృహా త్త్వ ॥

తా॥ అందుచే ఆపురుషమృగ ప్రయాణమున విఘ్నము కాగలదు. శివలింగ మయములగు నా తోక వెంట్రుకలను తీసికొనుము.

శ్లో॥ గృహీ త్వేమాని రోమాణి గచ్ఛ తస్యాన్తికం ద్రుతం
తం ప్రార్థయ మృగన్యాయా దవధారయ తద్వచః ॥

తా॥ ఈ వెంట్రుకలను తీసికొని శీఘ్రముగా ఆపురుష మృగ సమీపమునకు వెళ్ళుము. మృగవిధానము ననుసరించి

దానిని ప్రార్థించుము. ఆ మృగము చెప్పిన మాటల నాల కించుము.

శ్లో॥ తతో గృహీత సంకేతో గచ్ఛ న్వేగేన తత్పరః
ఏకైకం తు పృథక్కృత్య రోమాణాం వినిపాతయ ॥

తా॥ గురుతుల బట్టి వేగముగ ముందు వెళ్ళుచు విడిగా ఒక్కొక్క వెంట్రుకనే పడవైచుము.

శ్లో॥ ఏవం సుధర్మా మారభ్య భుక్తశాలావధీ ధృతం
కర్తవ్య మప్రమాదేన పురతో ధావత స్త్వయా ॥

తా॥ ఇట్లు దేవసభయగు సుధర్మ మొదలుకొని భోజన శాలవరకును వేగముగా ముందు పరుగిడుచు పొరబాటు జెందక నీవు చేయవలసినది.

శ్లో॥ ఏకైక లోమవిన్యాసా ద్యదా లింగోద్భవో భవేత్
తదాతిక్రాంత వర్త్మానం న త్వా మభి భవిష్యతి ॥

తా॥ ఎప్పుడైతే ఒక్కొక్క రోమమును వదలుట వలన లింగము లుద్భవిల్లునో ఆ కారణముగా మార్గము నతిక్ర మించిన నిన్ను ఆ మృగము తిరస్కరింపలేదు.

శ్లో॥ ఏవం మదుక్తయోగేన కర్తవ్యం జయ మిచ్ఛతా
తవాలభ్యో మృగశ్రేష్ఠః న స్యా త్తవ పరాజయః ॥

తా॥ విజయముకోరిన నీవీ రీతిగా నేనుచెప్పినట్లు కర్త వ్యము తీర్చగల్గుచో ఆ మృగశ్రేష్ఠము దొరుకకుండుట కాని, నీకు పరాజయముకాని జరుగదు.

శ్లో॥ ఇ త్యాదిశ్య హితం తస్మై హనూమా నుష్ట్రవాహనః
నిజ వాలాగ్రరోమాణి ప్రదదే ముష్టిమాత్రతః ॥

తా॥ ఒంటె వాహనముగాకల హనుమంతు డీ రీతిగా భీముని హితముకోరి ఆదేశించి తన తోక చివతి వెంట్రుకలు గుప్పెడు ఇచ్చెను.

శ్లో॥ భీమోఽప్యుపాయలాభేన పరమానంద నిర్భరః
స్తోత్రేణ మహతా స్తుత్వా భ్రాతరం కపి మబ్రవీత్ ॥

తా॥ మంచి ఉపాయము లభించినందుకు భీముడు పరమానందమునంది గొప్పస్తోత్రములతో స్తుతించి సోదరుడగు హనుమంతునితో నిట్లనెను :

శ్లో॥ హనుమన్మూర్తి రూపాణి స్థూల సూక్ష్మ సమాని తే
అత్యద్భుతాని లోకేషు సన్తీతి బహుధా శ్రుతమ్ ॥

తా॥ ఓ ఆంజనేయా! నీతో స్థూలముగాను సూక్ష్మముగాను సమానమైన అత్యద్భుతములైన విగ్రహ రూపములు లోకములందు కలవని మిక్కిలిగ వింటిని.

శ్లో॥ తాని దర్శయ సర్వాణి మహ్యం జిజ్ఞాసవే ప్రభో
ఇతి తత్ప్రార్థనాం శ్రుత్వా ప్రత్యువాచ కపీశ్వరః ॥

తా॥ ఓ మహానుభావా! చూడనిచ్ఛకల నాకు వాని నన్నింటిని చూపించుము. అనగా నాతని ప్రార్థన నాలించి హనుమంతు డిట్లనెను–

శ్లో॥ సన్తి రూపా ణ్యనేకాని స్థూల సూక్ష్మ సమాని మే
కిన్తు తాని విశేషేణ దర్శనీయాని చాధునా ॥

తా॥ స్థూలముగాను సూక్ష్మముగాను సమానములగు

రూపము లనేకము లున్నవి. కాని అవి నీకు విశేషముగా చూడదగినవి.

శ్లో॥ సామాన్యేన ప్రవక్ష్యామి తల్లింగాని నిబోధ మే

తా॥ ఇప్పుడు సామాన్యముగా చెప్పుచున్నాను; ఆ నా రూపముల చిహ్నములను గుర్తించుము.

శ్లో॥ ఏన రూపేణ మే రాజన్ లాలితా జనకాత్మజా
తాదృశం విద్ధి రూపం త్వం సూక్ష్మం చ సదృశో మమ॥

తా॥ ఓ రాజా! సీతాదేవి నాయొక్క ఏ రూపముతో ఓదార్చబడినదో ఆ నా రూపమును సూక్ష్మ రూపముగా నెఱుంగుము

శ్లో॥ యాదృశం రూప మాలంబ్య లోకానుగ్రహకారణాత్
అవష్టభ్య పదద్వంద్వ ముదయాస్తాద్రి మూర్ధని ॥

తా॥ లోకానుగ్రహ కారణముగా ఏ రూపము ధరించి ఉదయాద్రి, అస్తాద్రులపై రెండు పాదములు పెట్టి—

శ్లో॥ అధీతా స్సకలా వేదా స్సాంగా స్సవితృసన్నిధౌ
తాదృశం మధ్యమం రూపం మామకం విద్ధి పార్థివ ॥

తా॥ సమస్త వేద వేదాంగములు సూర్య భగవానుని కడ నేర్చుకొంటినో ఆ నా రూపమును మధ్యమ రూపముగా తెలిసికొనుము.

శ్లో॥ అపరం మధ్యమం చాస్తి రూపం రూపవతాంవర!
యస్య వాలమయం సేతుం కృత్వా సప్తార్ణవోపరి ॥

తా॥ ఓ రూపవంతుడా! భీమా! ఇంకొక మధ్యమ రూపము కూడ కలదు. సప్త సముద్రముల పైనను ఏ నా రూపము తోకతో సేతువును నిర్మించుట వలన-

శ్లో॥ శతాననో మహాదైత్యో ఘాతితో రామభార్యయా
ఏవమాదీని రూపాణి మధ్యమాని నిబోధ మే ॥

తా॥ రాముని భార్యయగు సీతచే శతాననుడను గొప్ప రాక్షసుడు సంహరింపబడెనో ఆ రూపము కూడ మధ్యమము. ఇట్లు నా మధ్యమ రూపములను తెలిసికొనుము.

శ్లో॥ యచ్చ విశ్వ మయం రూపం విశ్వతోముఖ మద్భుతం
జానక్యై దర్శనం సాక్షాత్ స్థూలం తద్విద్ధి మామకమ్॥

తా॥ ఏదైతే విశ్వమంతటికి అద్భుతమై విశ్వమయమైనదియై సీతాదేవికి సాక్షాత్తుగా దర్శన మీయబడినదో అది నా యొక్క స్థూలరూపముగా తెలిసికొనుము.

శ్లో॥ తత్తత్కార్యానురోధేన తత్తత్కాలానుసారతః
దర్శనీయాని రూపాణి న చ సర్వత్ర సర్వదా ॥

తా॥ ఆయా అవసర కార్యముల బట్టి ఆయా కాలముల ననుసరించి ఆయా రూపములు చూప దగినవే కాని అన్ని వేళల అంతటా చూపదగినవి కావు.

శ్లో॥ ఇదానీం యది రూపాణి దర్శయే యాద్భుతాని చ
భీతి స్తే భవత స్సద్యః పీడా చ జగతో భవేత్ ॥

తా॥ ఇప్పుడు ఆ అద్భుతములగు రూపములు చూపిన

యెడల వెంటనే నీవు భయమందగలవు లోకములు కూడ బాధనందగలవు.

శ్లో॥ తథాపి సూక్ష్మరూపం మే దర్శయిష్యామి పాండవ!
ఇతి బ్రువ న్నయం సద్యః నీవారాగ్రసమోఽభవత్

తా॥ అయినను ఓ పాండుతనయా! నా సూక్ష్మ రూపమును చూపెదను. అనుచు హనుమంతుడు వెంటనే తను నీవారధాన్యపు కొన యంత పొడవయ్యెను.

శ్లో॥ దృష్ట్వా సూక్ష్మతనుం దేవంభీమో విస్మయ మాయయా
తావ ద్రూపాంజనాపుత్రో రూపాన్తర మగా న్మహత్

తా॥ అట్టి సూక్ష్మదేహ మందిన స్వామిని చూచి భీముడు అత్యంతము ఆశ్చర్యమందెను. అటువంటి రూపాంతరము కల హనుమంతుడు వెంటనే గొప్పగా రూపాంతర మందెను.

శ్లో॥ దశయోజన విస్తీర్ణం త్రింశద్యోజన మాయతం
తేనైవ రూపభేదేన తీర్ణో హి సరితాంపతిః॥

తా॥ పది యోజనముల వెడల్పు, ముప్పది యోజనముల పొడవు కల రూపమును అప్పుడు పొందెను. అట్టి రూపముతోనే ఆతడు సముద్రమును లంఘించెను.

శ్లో॥ తద్రూపదర్శనా త్సద్యో భీమసేనో ముమూర్ఛ సః
తదా తం మూర్ఛితం దృష్ట్వా హనుమా న్భ్రాతృవత్సలః

తా॥ ఆ రూపమును చూచిన వెంటనే భీమసేనుడు మూర్ఛపోయెను. అప్పుడారీతిగా మూర్ఛ నందిన భీముని చూచి సోదర ప్రేమకల హనుమంతుడు-

శ్లో॥ మా భైషీ రిత్యథా భాష్య పాణినా సమతాడయత్
త త్పాణిస్పర్శమాత్రేణ సుప్తోత్థిత ఇవాఽ భ్వని।

తా॥ అప్పుడు భయపడవద్దనుచు చేతితో భీముని తట్టెను. హనుమంతుని హస్తస్పర్శ మాత్రముతో నిద్దుర మధ్యలో నున్నవానివలె-

శ్లో॥ సంజ్ఞాం లేభే విసంజ్ఞోఽపి ధర్మరాజానుజ స్తథా
తుష్టావ బహుభిః స్తోత్రైః అప్రమేయం కపీశ్వరమ్.

తా॥ చైతన్యము లేనివాడై కూడా ధర్మరాజ సహోదరుడగు భీముడు తెలివినందెను పిమ్మట అనంతుడగు ఆంజనేయుని పెక్కు స్తోత్రములతో స్తుతించెను.

శ్లో॥ ప్రదక్షిణ నమస్కారాన్ పంచసంఖ్యాన్ చకార సః
హనూమా నపి సర్వాత్మా హిత మాదిశ్య బంధవే
అంతర్దధే దయాసింధుః భీమసేనస్య పశ్యతః.

తా॥ ఆతడు ఐదు ప్రదక్షిణములను, ఐదు నమస్కారములను చేసెను. సర్వాత్మకుడు, దయా సముద్రుడు అగు హనుమంతుడు బంధువగు భీమునకు హితమును చెప్పి ఆతడు చూచుచుండగానే అంతర్ధానము చెందెను.

శ్లో॥ రాజాపి విస్మయావిష్టో హృదయ న్యస్త తద్వచః
వాలరోమాణి సంగృహ్య ప్రవిష్టో దేవతాసభామ్.

తా॥ రాజగు భీముడు ఆశ్చర్యము నందినవాడై హనుమంతుని మాటను మనసులో బెట్టుకొని అతని రోమ వెంట్రుకలను తీసికొని దేవ సభను ప్రవేశించెను.

శ్లో॥ తత్రాపశ్య న్మృగశ్రేష్ఠం సుధర్మామధ్యవర్తినం
నవామ దండవ త్తస్య కుశలప్రశ్నపూర్వకమ్.

తా॥ ఆ సుధర్మ సభా మధ్యమున ఆతడు పురుష మృగమును చూచి కుశల ప్రశ్నములు వేయుచు దండ ప్రణామము లాచరించెను.

శ్లో॥ తతో విజ్ఞాపయామాస మృగాయ స్వప్రయోజనం
అహం పాండుసుతో భీమః దేవరాజాత్మజాగ్రజః॥

తా। పిమ్మట ఆ పురుషమృగమునకు తన కోర్కెను ఇట్లు వివరించెను:- ఓ పురుషమృగసత్తమా! నేను పాండురాజు యొక్క కుమారుడను; భీముడను; ఇంద్రుని కుమారుడగు అర్జునునకు అన్నను

శ్లో॥ మదగ్రజో మహారాజో ధర్మరాజో జితేంద్రియః
క్రియతే రాజసూయేన ధర్మసూను ర్హిధర్మవిత్.

తా ధర్మజ్ఞుడగు ఆ యమధర్మరాజపుత్రుడును, జితేంద్రియుడును, మహారాజనగు నాయన్న ధర్మరాజు రాజసూయయాగము చేయుచున్నాడు.

శ్లో॥ తత్ర పుణ్యే మహాసత్త్రే భుక్తశాలాభిసద్ధయే
త్వ మాగచ్ఛ మృగశ్రేష్ఠ! పవిత్రీకృత విష్టపః॥

తా॥ అచ్చట పుణ్యప్రదమగు అన్నప్రదానశాల కలదు. ఆ భోజనశాలయొక్క శుద్ధికొఱకు ఓ మృగశ్రేష్ఠా! లోకములనే పవిత్రముచేయజాలిన నీవు రావలసినది.

శ్లో॥ ఇత్యాకర్ణ్య వచ స్తస్య పుంమృగో హృష్టమానసః
జగామ వచనం తస్య బుభుత్సు ర్హృదయం బుధః॥

తా॥ అని చెప్పగా ఆతని మాటలు విన్న పురుష మృగము సంతోషించి ఆతనిమాటలబట్టి విజ్ఞతతో భీముని యభిమతము నెఱిగెను.

శ్లో॥ రాజన్ ప్రీతోఽస్మి భద్రం తే యత్త్వయా సాధుభాషితం
కి న్త్వహం పురుషాహార పరుషాక్షర భాషణః॥

తా॥ ఓ రాజా! నేను ప్రీతినందితిని. యోగ్యమగు వాక్కుకల నీకు క్షేమమగుగాక. కాని నేను పురుషులు ఆహారముగా కలదానను, కఠిన భాషణము కలదానను.

శ్లో॥ సంగచ్ఛేయం యదా మార్గే పురద్వారావధి స్త్వయం
తదా త్వాం భక్షయిష్యే ఽహం తత్ర సాక్షీ మహాజనః॥

తా॥ మనము మీ నగరద్వారము చేరుటకు బయలుదేరి వెడలుమార్గమునందే అప్పుడే మహాజనము చూచుచుండగనే భక్షింతును.

శ్లో॥ కృత్వా మాం పృష్ఠతో దూరం గచ్ఛ క్షేమపురస్సరం
అశక్తాయ తదా మహ్యం కుతః పురుషభోజనమ్॥

తా॥ నన్ను నీవెనుక దూరముగ నుండునట్లొనర్చిచు

క్షేమముగా వెళ్ళుము. అప్పుడు అవకాశము లేని పద్ధతిలో నాకు పురుష భోజన మెట్లుజరుగును?

శ్లో॥ ఇతి స్వమత మావేద్య పుంమృగ శ్శివభక్తిమాన్
పురో గచ్ఛేతి రాజాన మిత్యుక్త్వా చాన్వగచ్ఛత॥

తా। అని తన యభిప్రాయము చెప్పి శివభక్తి యుతమగు పురుషమృగము రాజును ముందు వెడలుమని తాను వెనుక వెడల మొదలిడెను.

శ్లో॥ తథా వాగ్రమనా భీమో వ్యగ్రచిత్తం మృగోత్తమం
వాలరోమ నిపాతేన వంచయామాస కించన॥

తా। అట్లే భీముడు ముందు వెడలుచు వేగిరపాటు కల పురుషమృగమును హనుమంతుని రోకవెంట్రుకలను దారిన పడవైచుచు మోసగించెను

శ్లో॥ తదా ప్రాదురభూ ల్లింగం శైవం లోమనిపాతనాత్
త దద్భుతోద్భవం దృష్ట్వా శివభక్తాగ్రణీ మృగః॥

తా॥ అప్పుడా రోమనిపాతము వలన శివలింగము ఉద్భవించెను. శివభక్తులలో అగ్రణియగు ఆ పురుష మృగము అద్భుతముగా పుట్టిన ఆ లింగమునుచూచి-

శ్లో॥ పూజయామాస పుష్పాద్యైః అభిషేచనపూర్వకం
తావ దేవ మహాసత్త్వో భీమో భీమపరాక్రమః॥

తా॥ అభిషేకమొనర్చి పూలతో పూజించెను. ఇంతలో భయకర పరాక్రమము కల ఆ భీమసేనుడు-

శ్లో॥ దూర మధ్వాన మత్యర్థం వ్యతిచక్రామ సక్రమాత్
తత స్సమాప్య విధివత్ శివపూజాం స పుంమృగః ॥

తా॥ క్రమముగా. మిక్కిలి దూరము బాటలో దాటెను. ఆ పురుష మృగము పిమ్మట యథావిధిగా శివ పూజను నిర్వర్తించుకొని-

శ్లో॥ అగ్రయాయిన మగ్రణ్యం క్షణాదే వాన్వపద్యత
తావ దేవ పున ర్భీమః పాతయామాసవాలజమ్ ॥

తా॥ మొదట బయలుదేరి ముందు వెళ్లుచున్న భీముని క్షణములో చేరుకొనెను. ఇంతలోనే మరల భీముడు హనుమ ద్వాలరోమము నొకదానిని పడవైచెను.

శ్లో॥ శివలింగ విధానేన చక్రే వ్యవహితం మృగం
ఏవం వికీర్య రోమాణి ప్రత్యేకం చ పృథక్ పృథక్
రిక్తవాలజ రోమస్సన్ పురద్వారం వివేశ సః ॥

తా॥ శివలింగ విధానముతో పురుష మృగమును దూరము చేసెను. ఇట్లు ఒక్కొక్కటి వేరువేరుగా ఆ వెంట్రు కలను విడచుచు తోక వెంట్రుకలన్నియు పూర్తికాగా పుర ద్వారమును భీముడు ప్రవేశించెను.

శ్లో॥ బహిర్వ స్యైకపాదాగ్ర మన్తర్విన్యస్త దక్షిణాం
జగృహే పుంమృగో భీమం నమాశిత శివార్చనః॥

తా॥ శివార్చనము పూర్తియైన మృగము ఇంతలోనే ఎడమ పాదము బయట, కుడికాలు లోపలఉండగానే భీముని పట్టుకొనెను.

శ్లో॥ అథాబ్రవీ న్మృగం భీమః తద్గ్రహాత్ప్రా న్త కాతరః
ఇద మన్యాయ్య మన్యాయ్యం విద్వ న్మాచర సాహసమ్॥

తా॥ అట్లు పట్టుకొనుట వలన మిక్కిలి భయమందిన వాడై భీముడా పురుష మృగముతో నిట్లనెను. ఓ సర్వ మెరిగిన వాడా ఇది అన్యాయము, అన్యాయము. సాహసము చేయవద్దు.

శ్లో॥ య స్త్వ ముల్లంఘ్య సమయ మ గ్రహీ న్మాం గృహా న్త రే
ధర్మజ్ఞస్య కృతజ్ఞస్య సత్యవాక్యోర్జితస్య తే
అధర్మే యది బుద్ధి స్స్యా దితరేషాం తు కా కథా॥

తా॥ ఏలనన ప్రతిజ్ఞను వీడి నన్ను ఇంటిలోపల పట్టు కొంటివి. ధర్మ మెరిగిన, చేసిన మేలు గుర్తుంచుకొనెడి, సత్యవాక్కుచే దార్ఢ్యము కల నీకే అధర్మమునందు బుద్ధి పుట్టినచో ఇక ఇతరుల విషయము చెప్పున దేమి?

శ్లో॥ ఇ త్యుక్త వన్తం రాజానం జగాద మృగస త్తమః
త్వ ద్భ్రాత్రా ధర్మరాజేన ధర్మజ్ఞేన యదుచ్యతే
త దేవ నో మహాధర్మ్యం వివాదో న భవే త్తతః.

తా॥ అని పలుకుచున్న భీమసేనునితో ఆ మృగ శ్రేష్ఠ మిట్లనెను. నీ సోదరుడు, ధర్మమెఱిగినవాడు అగు ధర్మరాజు చే ఏది చెప్పబడునో అదే మనకు మహాధర్మము. అంతకు మించి వివాదము లేదు.

శ్లో॥ ఏవం సంవేద్య వృత్తాన్తం ధర్మరాజాయ ధీమతే
శ్రావయాంచక్రతు స్సన్య జ్మృగభీమౌ యథాక్రమమ్.

తా॥ ఈ రీతిగా బుద్ధిమంతుడగు ధర్మరాజునకు వృత్తాంతము తెల్పి ఆ మృగము, భీముడును క్రమము ననుసరించి విషయము వినిపించిరి.

శ్లో॥ తచ్ఛ్రుత్వా సకలం వృత్తం ధర్మజ్ఞో ధర్మనందనః
విస్మయానంద పూర్ణాన్తః బభాషే ధర్మనందనః॥

తా॥ ధర్మవిదుడగు ధర్మరాజు జరిగినదంతయు విని ఆశ్చర్యము, ఆనందములతో నిండిన మనస్సు కలవాడై ఇట్లు పల్కెను-

శ్లో॥ మృగోత్తమ! మహాప్రాజ్ఞ నాధర్మ స్తవ విద్యతే
కి న్త్వథా ప్యధికో భీమో యే నాదౌ ద్వార మావిశత్
తం విహాయార్ధకాయ స్త్వం శేషం భక్షయ పుంమృగ॥

తా॥ ఓ విజ్ఞానము కల మృగ శ్రేష్ఠమా! నీ యందు అధర్మము లేదు కాని నీ కంటె భీముడు ముందుగ ద్వారము ప్రవేశించిన కారణమున ఆ ప్రవేశించిన అర్ధశరీరమును వదలి మిగిలిన అర్ధభాగమును భక్షించుము.

శ్లో॥ ఇత్యుక్తవచనం త్యక్త్వా పక్షపాతం యుధిష్ఠిరం
మృగ స్స ప్రీణయాంచక్రే నిర్దుష్టగుణవర్ణనైః॥

తా॥ ఇట్లు పక్షపాతము వీడి మాటాడిన ధర్మరాజును దోషరహితమగు గుణముల వర్ణనలతో ఆ పురుష మృగము సంతోష పరచెను.

శ్లో॥ తతః ప్రీతమనా భూయః నృపధర్మేణ పుంమృగః
భుక్తశాలాః పృథాసూనోః శోధయామాస సంచరన్॥

తా॥ పిమ్మట ఆ రాజ ధర్మము వలన సంతసించిన పురుష మృగము ధర్మరాజుయొక్క భోజనశాలయందు సంచరించుచు శుద్ధ మొనర్చెను.

శ్లో॥ ఇత్యేవం సఫలగతిం విధాయ భీమం
ఆపృచ్ఛ్య ప్రియసుహృదం హృదా స్మరన్తం
తైస్తైః పురుషమృగోఽభిపూజ్యమానః
స్వాగత్యా చకితసురాం దివం ప్రపేదే॥

తా॥ ఇట్లు మనసార స్మరించు స్నేహితులను ఆదరించుచు భీముని సఫల మనోరథుని జేసి అచ్చటివారిచే పూజింపబడుచు పురుష మృగము తన రాకచే ఆశ్చర్యమందు దేవతలు కల స్వర్గలోకము చేరెను.

శ్లో॥ ఆంజనేయ కృపయాత్త పౌరుషం
భీమ మార్యచరితం యుధిష్ఠిరః
తం ప్రశస్య పురతో మహీభుజాం
యజ్ఞశేష మనయ న్మునీశ్వర!

తా॥ ఓ మైత్రేయ మహామునీ! ఆంజనేయుని దయవలన గొప్ప పౌరుషమును సంపాదించుకొని గొప్ప చరిత్ర నందిన ఆ భీముని రాజులందరి యెదుట ప్రశంసించి ధర్మరాజు ఆతనికి యజ్ఞ ఫలమున భాగమిచ్చెను.

ఇతి శ్రీ పరాశరసంహితాయాం
పరాశర మైత్రేయ సంవాదే
పురుషమృగాహరణోపాయ కథనం నామ
ఏకపంచాశత్పటలః.

ద్విపంచాశత్పటలః

# హనుమన్మానసికపూజాకథనం

శ్రీ మైత్రేయః :—

శ్లో॥ కాథ మారాధ్యతే చిత్తే హనుమా న్మారుతాత్మజః
కీదృశై రుపచారైర్వా వద మే విస్తరా న్మునే! ॥

తా॥ శ్రీ మైత్రేయుల వారడుగుచున్నారు. ఓ పరాశర మహామునీ! వాయుసుతుడగు హనుమంతుని మనసునందారాధించుట ఎట్లో, ఎట్టి ఉపచారములు ఆ మానసిక పూజయందు నర్చవలెనో సవిస్తరముగా చెప్పవలసినది.

శ్రీ పరాశరః:—

శ్లో॥ హనుమ న్తం మహాత్మానం పింగాక్షం హేమసన్నిభం
మందస్మితం సుఖాసీనం ధ్యాయే దీప్సితసిద్ధయే ॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు: ఓ మైత్రేయమునీ! మహాత్ముడు, పింగళ వర్ణము కల కండ్లు కలవాడు, బంగారపు ఛాయ కలవాడు, చిఱునవ్వు నవ్వువాడు, సుఖాసీనుడు అగు హనుమంతుని గూర్చి కోర్కెలు సిద్ధించుటకై ధ్యానించవలెను.

శ్లో॥ తాపత్రయ పరివ్యాప్తం చిత్తం కృత్వా సునిర్మలం
భావయే న్మనసా దేవం భవతాప విముక్తయే ॥

తా॥ భార్యాబిడ్డలు, ధనము అనునట్టి తాపత్రయను

వ్యాపించియున్న మనస్సును నిర్మలము గావించి సంసార శాపములు తొలగుటకై మనసార శ్రీ హనుమంతుని భావించవలెను.

శ్లో॥ ప్రాతఃకాలే సముత్థాయ హనూమన్తం హృది స్మరన్
శుచౌ దేశే సమాసీనః కృత ప్రాభాతకీ క్రియాః ॥

తా॥ ప్రభాత సమయముననే లేచి ప్రాతఃకాలమున వలయు కృత్యముల నెరవేర్చుకొని, విశుద్ధ ప్రదేశమున కూర్చుండి హనుమంతుని హృదయమున స్మరించుచు-

శ్లో॥ విజనం దేశ మాశ్రిత్య కదళీవన మధ్యగః
చిత్త విక్షేప రహితః పూజావిధి ముపక్రమేత్ ॥

తా॥ జన సంచారము లేనిచోట అరటి తోట మధ్య చేరి మనశ్చాంచల్యము లేనివాడై పూజావిధానమును మొదలు పెట్టవలెను.

శ్లో॥ పూజా పంచధా జ్ఞేయా కపీంద్రస్య మహాత్మనః
జలే చ ప్రతిమాయాం చ శిలాయాం సూర్యమండలే
నిశ్చలే మానసే వాపి పూజయే జ్జగతాంపతిమ్ ॥

తా॥ మహాత్ముడగు హనుమంతుని పూజ ఐదు విధములుగా నున్నది. నీటితో చేయు పూజ, ప్రతిమా పూజ, శిలయందు పూజ, సూర్యమండలమందు దృష్టితో పూజ, నిశ్చలమగు మనస్సునందు చేయు పూజ అని ఐదు విధములుగా జగన్నాథుడగు హనుమంతుని పూజింపవలెను.

శ్లో॥ ఆద్యే సర్వోపచారా నై జలే నైవ ప్రకల్పయేత్
ద్వితీయే తు యథాశాస్త్రం తథా ద్రవ్యం నివేదయేత్॥

తా॥ మొట్టమొదటి పూజయందన్ని యుపచారములను నీటితోనే యొనర్పవలెను. రెండవ పూజయందు శాస్త్రము చెప్పిన రీతిగా పూజా ద్రవములను నివేదించవలెను.

శ్లో॥ తృతీయే న విశేషోఽస్తి ద్వితీయ ఇవ పూజయేత్
తురియే నిశ్చలాం దృష్టిం కృత్వా భాస్కరమండలే॥

తా॥ మూడవ పూజా విధానమున విశేషము లేదు. రెండవ రకపు పూజ వలెనే యొనర్చవలెను. నాల్గవ రకపు పూజా విధానమున సూర్య మండల మందు నిశ్చలముగ దృష్టి నుంచి-

శ్లో॥ పూజాద్రవ్యం సమానీయ చక్షుషా సన్నిధాపయేత్
పంచమీ మానసీపూజా సర్వేషా ముత్తమోత్తమమ్॥

తా॥ పూజా ద్రవ్యములన్నింటిని కన్నులార నివేదించవలెను. ఐదవదియగు మానసిక పూజ అన్ని పూజలలోను ఉత్తమోత్తమమైనది.

శ్లో॥ తత్ర ద్రవ్యాణి సర్వాణి పూజాయాః సాధనాని వై
నిశ్చలే నాన్తరంగేణ కపీంద్రాయ నివేదయేత్॥

తా॥ ఈ పూజయందు పూజా సాధనములగు ఆయా ద్రవ్యము లన్నిటిని తెచ్చి నిశ్చలమగు మనస్సుతో వానర శ్రేష్ఠుడగు మారుతికి నివేదన మొనర్చవలెను.

శ్లో॥ దళై ర్ద్వాదశభి ర్యుక్తం హైమం హృదయపంకజం
భావయే ద్వికచం రమ్యం కర్ణికా కేసరాన్వితమ్ ॥

తా॥ పండెండు దళములలో నుండి, లోపల దుద్దు, కింజల్కము కల్గి, బాగుగ వికసించి రమ్యముగ నున్న బంగారు హృదయ పద్మమును భావనచేయవలెను.

శ్లో॥ తత్ర సింహాసనం తత్ర హైమం భాస్కర సన్నిభం
నిర స్తాన్త స్తమ స్తోమం కల్పయే న్మునిపుంగవ!

తా॥ ఓ మునిశ్రేష్ఠా! అచ్చట బంగరు మయమై సూర్యునివలె ప్రకాశించుచు చీకటులనన్నిటిని పోగొట్టజాలు సింహాసనమును కల్పింపవలెను.

శ్లో॥ ఆవాహయే ద్ధనూమంతం తత్ర సింహాసనే సుధీః
అథ ధ్యాయే త్కపిశ్రేష్ఠం చతురావరణాన్వితమ్॥

తా॥ బుద్ధిశాలియగు ఆ అర్చకుడు ఆ సింహాసనమున హనుమంతుని ఆవాహన మొనర్చవలెను. పిదప చతురావరణము కల్గియున్న ఆ హనుమంతుని ధ్యానింపవలెను.

శ్లో॥ వామభాగ స్థితాం పత్నీం సూర్యపుత్రీం సువర్చలాం
పశ్య న్తం స్నిగ్ధయా దృష్ట్యా స్మితయుక్త ముఖాంబుజాం

తా॥ ఎడమభాగమున నున్న పత్నియు, సూర్య పుత్రియు, చిఱునగవుకల ముఖ పద్మముతో ప్రకాశించు నదియు అగు సువర్చలను ప్రేమతో చూచునట్టి-

శ్లో॥ ఛత్ర చామర సంయుక్త వినతాద్యై స్సుసేవితం
యుక్త హారగణోపేతం తత్ర కుండలభూషితమ్॥

తా॥ ఛత్ర చామరములతో కూడియున్న వినతుడు మున్నగు వారిచే సేవింపబడుచున్నట్టియు, యోగ్యములగు హారములు కల్గి యున్నట్టియు, కుండలములతో ప్రకాశించుచున్నట్టియు,

శ్లో॥ గ్రైవేయ భూషిత గ్రీవం కనకాంగద ధారిణం
నానామణి సముత్కీర్ణం కిరీటోజ్జ్వల శేఖరమ్॥

తా॥ కంఠాభరణముతో నలంకరింపబడిన కంఠము కల్గినట్టియు, బంగారు కేయూరములు ధరించినట్టియు, వివిధములగు మణులతో వ్యాపించినట్టి కిరీటముతో ప్రకాశమానమగు శిరస్సు కల్గినట్టియు,

శ్లో॥ మేఖలా దామ సంవీతం మణినూపుర శోభితం
రత్నకంకణ విద్యోతం పాణి రక్తాంబుజ ద్వయమ్॥

తా॥ చక్కని మొలత్రాడు చుట్టుకొని యున్నట్టియు, మణులు పొదిగిన అందెలతో ప్రకాశించునట్టియు, రత్నములు కల కంకణములతో ప్రకాశించునట్టియు, ఎఱ్ఱ దామరలు రెండు చేతుల గల్గినట్టియు,

శ్లో॥ క్వథిత స్వర్ణ వర్ణాంగ ముష్ట్రిధ్వజ సమన్వితం
పద్మాసనే సమాసీనం పీతాంబర సమన్వితమ్॥

తా॥ పుటము పెట్టిన బంగారము వంటి రంగుకల్గి

నట్టియు, ఒంటె గుర్తుకల జెండాతో కూడియున్నట్టియు, పద్మాసనమందు కూర్చొనియున్నట్టియు, పచ్చని వస్త్రము ధరించినట్టియు,

శ్లో॥ చతుర్భుజధరం శాంతం సర్వవ్యాపిన మీశ్వరం
సర్వ దేవ పరీవారం సర్వాభీష్ట ఫలప్రదమ్॥

తా॥ నాల్గు భుజములను ధరించునట్టియు, శాంతుడైనట్టియు, అంతట వ్యాపించునట్టియు, సర్వసమర్థుడైనట్టియు, దేవతలందరు పరివారముగా కల్గినట్టియు, సర్వవిధముల కోరికలను తీర్చునట్టియు,

[ఆవాహనాద్యుపచార ప్రారంభము]

శ్లో॥ ఆవాహయామి సర్వేశం సూర్యపుత్రీప్రియం ప్రభుం
అంజనాతనయం దేవం మాయాతీతం జగద్గురుమ్॥

తా॥ అంజనాతనయుడైనట్టియు మాయాతీతుడైనట్టియు, జగత్తుకంతటికి గురుస్థానీయుడైనట్టియు, సూర్యుని కుమార్తెయగు సువర్చలకిష్టుడైనట్టియు, సర్వేశ్వరుడైనట్టియు, సర్వసమర్థుడైనట్టి దేవుడగు హనుమంతునకావాహన మొనర్చుచున్నాను.

శ్లో॥ దేవదేవ! జగన్నాథ! కేసరిప్రియనందన!
రత్నసింహాసనం తుభ్యం దాస్యామి హనుమత్ప్రభో॥

తా॥ దేవదేవా! జగన్నాథా! కేసరిప్రియసుతా! హనుమన్మహాప్రభో! నీకు రత్నఖచిత సింహాసనమును సమర్పించుకొనుచున్నాను.

శ్లో॥ ఆగచ్ఛ హనుమన్! దేవ! త్వం సువర్చలయా సహ
పూజా సమాప్తిపర్యన్తం భవ సన్నిహితో ముదా॥

తా॥ ఓ దేవా! హనుమంతా! నీవు సువర్చలతో కలసిరమ్ము. పూజపూర్తియగువరకు సంతసముతో సన్నిహితుడవై ఇచ్చటనుండుము.

శ్లో॥ భీమాగ్రజ! మహాప్రాజ్ఞ! త్వం మమాభిముఖో భవ
సువర్చలాపతే శ్రీమన్ ప్రసీద జగతాంపతే!॥

తా॥ భీమునిసోదరుడా! గొప్ప ప్రజ్ఞకలవాడా! నీవు నాకు అభిముఖుడవుకమ్ము. ఓ సువర్చలాపతీ! శ్రీమంతుడా! జగన్నాథా! నన్ననుగ్రహింపుము.

శ్లో॥ యోగిధ్యేయాంఘ్రిపద్మాయ జగతాం పతయే నమః
పాద్యం మయార్పితం దేవ! గృహాణ పురుషోత్తమ॥

తా॥ యోగులచే ధ్యానింపదగిన పాద పద్మములు కల్గిన జగత్తునకాధారుడైన హనుమంతునకు నమస్కారము. ఓ దేవా! పురుషశ్రేష్ఠుడా! నేను సమర్పించు పాద్యమును స్వీకరింపుము.

శ్లో॥ లక్ష్మణప్రాణ సంరక్ష! సీతాశోక వినాశన!
గృహాణార్ఘ్యం మయా దత్తం పార్వతీ ప్రియనందన॥

తా॥ లక్ష్మణుని ప్రాణములను సంరక్షించినవాడా! సీతా దేవియొక్క దుఃఖము నణచినవాడా! శంకరపుత్రా! నాచే నీయబడు అర్ఘ్యమును స్వీకరింపుము

శ్లో॥ వాలాగ్ర సేతుబంధాయ శతానన వధాయ చ
తుభ్యమాచమనం దత్తం ప్రతిగృహ్ణీష్వ మారుతే॥

తా॥ వాలాగ్రమున సేతువుబంధించినట్టి, శతాననుని నాశన మొనర్చినట్టి నీకు ఆచమనము నిచ్చుచున్నాను. ఓ వాయునందనా! స్వీకరింపవలసినది.



శ్లో॥ అర్జున ధ్వజ సంవాస! దశానన మదాపహా!
మధుపర్కం ప్రదాస్యామి హనుమన్ ప్రతిగృహ్యతామ్॥

తా॥ అర్జునుని ధ్వజముపై నున్నవాడా! రావణుని మదము నణచినవాడా! హనుమంతా! నీకు మధుపర్కమును సమర్పించుచున్నాను; స్వీకరింపవలసినది.



శ్లో॥ గంగాది సర్వతీర్థేభ్యః సమానీతైర్నవోదకైః
భవన్తం స్నాపయిష్యామి కపినాయక గృహ్యతామ్॥

తా॥ గంగ మున్నగు అన్ని నదులనుండి తేబడిన క్రొంగ్రొత్త నీటితో నిన్ను స్నానము చేయించుచున్నాను. ఓ వానరప్రభూ! స్వీకరింపవలసినది.



శ్లో॥ పీతాంబర మిదం తుభ్యం తప్త హాటక సన్నిభం
దాస్యామి వానరశ్రేష్ఠ సంగృహాణ నమోస్తు తే॥

తా॥ పుటము పెట్టిన బంగారముతో సమానమగు పీతాంబరమును నీకు సమర్పించుచున్నాను. స్వీకరింపవలసినది. ఓ కపీశ్వరా నీకు నమస్కారము.

శ్లో॥ బ్రహ్మసూత్ర మిదం భవ్యం ముక్తాదామోపశోభితమ్
స్వీకురు ష్వాంజనాపుత్ర భక్తరక్షణ తత్పర!॥

తా॥ ముత్తెములు గ్రుచ్చిన త్రాడుతో ప్రకాశించు యోగ్యమగు బ్రహ్మసూత్ర మిదిగో! భక్తులను రక్షించుట యందు నిమగ్నుడవై యున్న ఓ ఆంజనేయా! స్వీకరింపుము.

శ్లో॥ ఉత్తరీయం తు దాస్యామి సంసారోత్తారకారణ!
గృహాణ పరమప్రీత్యా నతోఽస్మి తవ పాదయోః॥

తా॥ సంసారబంధము నుండి రక్షింపజాలినవాడా! నీకు ఉత్తరీయమును సమర్పించుకొనుచున్నాను. నీ పాదములకు వినమ్రుడనై నమస్కరించుచున్నాను. మిక్కిలి ప్రీతితో స్వీకరింపవలసినది.

శ్లో॥ భూషణాని మహార్హాణి కిరీటప్రముఖాన్యహం
తుభ్యం దాస్యామి సర్వేశ! గృహాణ కపినాయక॥

తా॥ కిరీటములు మొదలుగాగల గొప్ప విలువైన ఆభరణములను నే నొసంగుచున్నాను. ఓ సర్వేశా! వానర నాయకా! వానిని స్వీకరింపవలసినది.

శ్లో॥ కస్తూరీ కుంకుమామిశ్రం కర్పూరాగరు వాసితం
శ్రీచందనం తు దాస్యామి గృహ్యతాం హనుమత్ప్రభో!

తా॥ కస్తూరి, కుంకుమ పూవులతో కూడినట్టి కర్పూరము, అగరులతో కలసియున్నట్టి శ్రీచందనములను సమర్పించుకొనుచున్నాను. ఓహనుమత్ప్రభూ! స్వీకరింపవలసినది.

శ్లో॥ సుగంధీని సురూపాణి వన్యాని వివిధాని చ
చంపకాదీని పుష్పాణి కమలా న్యుత్పలాని చ ॥

తా॥ మంచి వాసన కల్గినట్టి, అందముగా నున్నట్టి మంచి వనములందు పూచిన వివిధములగు సంపెంగ పూవులను, కమలములను, కలువలను,

శ్లో॥ తులసీదళ మాదీని మనసా కల్పయామి తే
గృహాణ హనుమ న్దేవ! ప్రణతో౽స్మి పదాంబుజే !

తా॥ తులసి మున్నగు దళములను కూడ నీకు సమర్పించుకొనుచున్నాను. ఓ దేవా! హనుమంతా! స్వీకరింపవలసినది. నీ పాద పద్మములకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ శాలీయా నక్షతా న్రమ్యాన్ పద్మరాగసమప్రభాన్
అఖండా న్ఖండితధ్వాంత స్వీకురుష్వ దయానిధే!

తా॥ రమ్యములై పద్మరాగ మణులవలె కాంతితో ప్రకాశించుచు ముక్కలు కాక యున్న శాలిధాన్యపు అక్షతలను సమర్పించుచున్నాను. అంధకార మణచగలవాడా! దయానిధీ! స్వీకరింపవలసినది.

శ్లో॥ కపిలాఘృత సంయుక్తః కృష్ణాగరు సముద్భవః
మయా సమర్పితో ధూపః హనుమన్ ప్రతిగృహ్య తాం॥

తా॥ కపిలగోవు ఆవు నేతితోడను, నల్లని అగరులతో చేసిన ధూపమును నేను సమర్పించు కొనుచున్నాను. ఓ హనుమంతా స్వీకరింపవలసినది.

శ్లో॥ నిరస్తాజ్ఞాన తిమిర తేజోరాశే! జగత్పతే!
దీపం గృహాణ దేవేశ! గోఘృతాత్తం దశాన్వితమ్ ॥

తా॥ అజ్ఞానాంధకారమును పోగొట్టగల తేజోరాశీ జగన్నాథా! దేవదేవా! ఆవునేతితో తడిసిన పదివొత్తుల దీపమును సమర్పించుకొనుచున్నాను. స్వీకరింపవలసినది.

శ్లో॥ ఇదం దివ్యాన్న మమృతం సూప శాక ఫలాన్వితం
సాజ్యం సదధి సక్షీరం శర్కరా మధు సంయుతమ్ ॥

తా॥ పప్పు, కూరలు, పండ్లతో కూడిన; నేయి, పెరుగు, పాలు కల్గిన; చక్కెర తేనెలతో కూడిన అమృత సమమగు దివ్యమగు అన్నమిదిగో!

శ్లో॥భక్ష్యం భోజ్యం చ లేహ్యం చ చోష్యం చాపి చతుర్విధం
గృహాణ హనుమన్ భక్త్యా స్వర్ణపాత్రే నివేదితమ్ ॥

తా॥ నములదగినవి, తినదగినవి, నాకదగినవి, జుఱ్ఱ దగినవి యగు భక్ష్య భోజ్య లేహ్య చోష్యములను నాలుగు విధముల పదార్థములను భక్తితో బంగరు పాత్రయందు నివేదించుకొనుచున్నాను. ఓ హనుమంతా! దయతో స్వీకరింప వలసినది.

శ్లో॥ సమర్పయామి పానీయం మధ్యే మధ్యే సుధోపమం
సచ్చిదానంద రూపాయ సృష్టి స్థిత్యంత హేతవే!॥

తా॥ సత్యము, జ్ఞానము, ఆనందము తన రూపమై సృష్టికి, స్థితికి, నాశనమునకు కారకుడవై యున్న ఓ

హనుమంతా! నీకు భోజనమునకు మధ్య మధ్య అమృతముతో సమానమగు నీటిని ఇచ్చుచున్నాను, స్వీకరింపవలసినది.

శ్లో॥ పూగీఫలై స్సమాయుక్తం కర్పూరాది సమన్వితం
స్వర్ణవర్ణ దళోపేతం తాంబూలం గృహ్యతాం హరే!

తా॥ మంచిపోకలతో కూడిన, కర్పూరము మున్నగు సుగంధ ద్రవ్యములు కల, బంగారము వంటి లేత తమల పాకులు కల తాంబూలమును సమర్పించుకొనుచున్నాను. ఓ హనుమంతా! స్వీకరింపవలసినది.

శ్లో॥ నీరాజన మిదం దివ్యం మంగళార్థం కపిప్రభో!
మయా సమర్పితం తాత! గృహాణ వరదో భవ ॥

తా॥ ఓ వానరాధిపా! మంగళము కల్గుటకై నీకు దివ్యమగు నీరాజనమును నేను సమర్పించుకొనుచున్నాను. ఓ దైవమా! స్వీకరింపవలసినది. అనుగ్రహింపవలసినది.

శ్లో॥ నృత్యం గీతం చ వాద్యం చ కృతం గంధర్వసత్తమైః
ప్రకల్పయామి మనసా రామదూతాయ తే నమః

తా॥ గంధర్వ శ్రేష్ఠులచే చేయబడిన నృత్య గీత వాద్యములను రామదూతవగు నీకు మనసా సమర్పించుకొను చున్నాను. గ్రహింపవలసినది.

శ్లో॥ రాజోపచారై స్సతతం పురాణపఠనాదిభిః
సంతుష్టో భవ సర్వాత్మన్ సర్వలింగమయాత్మక ॥

తా॥ సర్వాత్మకుడా! సర్వలింగ మయాత్మకుడా

పురాణ పఠనాదులతో నే నెల్లప్పుడు నొనర్చు రాజోపచార ములతో నీవు సంతుష్టుడవు కావలసినది.

శ్లో॥ మైరావణ మహాప్రాజ్ఞ ప్రాణవాయు బిలేశయ!
పునరర్ఘ్యం ప్రదాస్యామి పవనాత్మజ గృహ్యతామ్॥

తా॥ మహాప్రాజ్ఞుడగు మైరావణుని ప్రాణవాయు బిలమున వసించు ఓ వాయునందనా! మరల అర్ఘ్యము నొసంగు చున్నాను. స్వీకరింపవలసినది.

శ్లో॥ మందార పారిజాతాది పుష్పాంజలి మిమం ప్రభో!
స్వర్ణపుష్ప సమాకీర్ణ ముష్ట్రధ్వజ గృహాణ వై॥

తా॥ మందారము, పారిజాతము మున్నగు వానితో కూడిన సువర్ణ దివ్య మంత్ర పుష్పాంజలిని సమర్పించుకొను చున్నాను. ఒంటె ధ్వజ చిహ్నముగా కల ప్రభూ! హను మంతా! స్వీకరింపవలసినది.

శ్లో॥ ప్రదక్షిణ నమస్కారాన్ సాష్టాంగా న్పంచసంఖ్యయా
దాస్యామి కపినాథాయ గృహాణాభీష్టదాయక!

తా॥ ప్రదక్షిణ సాష్టాంగ నమస్కారముల నైదైదు సంఖ్యతో చేయుచున్నాను. కోరిన వరము లిచ్చువాడా! వానరశ్రేష్ఠా! స్వీకరింపవలసినది.

శ్లో॥ దేవదేవ! జగన్నాథ! పురాణపురుషోత్తమ
అనేన పూజావిధినా సుప్రీతో భవ సర్వదా॥

తా॥ ఓ దేవదేవా! జగన్నాయకా! పురాణ పురుషోత్తమా! ఎల్లప్పుడు ఈ పూజావిధిచే సంతృప్తుడవగుము.

శ్లో॥ సువర్చలాసమేత స్త్వం చతురావరణాన్వితం
హంసతూలిక యోపేతే మమ హృత్పంకజే వస!॥

తా॥ నీవు సువర్చలా దేవితో కలిసి చతురావరణాలతో కూడి, హంసతూలికాతల్పము వంటి నా హృదయపద్మమున వసించుము. [ఇంతవరకు మానసికపూజ]

శ్రీ పరాశరః-

శ్లో॥ ఇత్యేవం మానసీపూజా సర్వాభీష్ట ప్రదాయినీ
శంకరేణ పురా గౌర్యా కథితా విస్తరా న్మనే॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు- ఓ మైత్రేయమహాముని! ఇదియే కోర్కెలన్నిటిని తీర్చజాలిన హనుమన్మానసపూజ. ఇది పూర్వము శంకరునిచే పార్వతికి సవిస్తరముగా చెప్పబడినది.

శ్లో॥ ప్రాత ర్మధ్యాహ్నయోశ్చాపి సాయంకాల నిశీథయోః
యదా కదాపి పూజేయం మానసీ సర్వదోత్తమా॥

తా॥ ఉదయ మధ్యాహ్న సాయం రాత్రులందు ఎప్పుడైనను ఈ పూజ చేయదగును. ఎల్లప్పుడు ఈ మానసపూజ శ్రేష్ఠమైనది.

శ్లో॥ ఏతస్య పూజనవిధేః పఠనేనాపి మానవః
సర్వాన్కామా నవాప్నోతి శ్రవణేన విశేషతః॥

తా॥ ఈ పూజావిధానమును పఠించుట వలనను, విశేషించి వినుటవలనను మానవుడు సమస్తములగు కోర్కెలను పొందగల్గును.

శ్లో॥ బ్రహ్మక్షత్రవిశాం స్త్రీణాం బాలానాంచ శుభావహం
ఇదం పవిత్రం పాపఘ్నం భుక్తి ముక్తి ఫలప్రదమ్॥

తా॥ ఇది బ్రాహ్మణులకు, క్షత్రియులకు, వైశ్యులకు, స్త్రీలకు, బాలురకు సర్వులకు శుభప్రదమైనది, పవిత్రమైనది, పాపముల తొలగించునది, భోగ మోక్ష ఫలముల నిచ్చునదియును.

ఇతి శ్రీ పరాశర మైత్రేయ సంవాదే
హనుమన్మానసిక పూజా కథనం నామ
ద్విపంచాశత్పటలః

త్రిపంచాశత్పటలః

## విశ్వరూప దర్శనము

శ్రీ మైత్రేయః -

శ్లో॥ పరాశర! మహాభాగ! దీనబంధో! దయానిధే!
భూయోఽపి కపినాథస్య కథాభి రపి తోషయ॥

తా॥ శ్రీ మైత్రేయులవారడుగుచున్నారు. ఓ మహానుభావుడా! దీనబంధూ! దయానిధీ! పరాశర మహామునీ! ఇంకను వానరశ్రేష్ఠుడగు హనుమంతుని కథలు చెప్పి నన్ను సంతృప్తుని గావింపుము.

శ్లో॥ కథ మాసీ త్కపీంద్రస్య భవిష్యద్బ్రహ్మ నామతః
త దహం శ్రోతు మిచ్ఛామి వర్ణనీయం మహామునే!॥

తా॥ హనుమంతునకు భవిష్యద్బ్రహ్మయను నామ ధేయము ఎట్లువచ్చెనో తెలియగోరుచున్నాను. ఓ పరాశర మహాముని! దానిని వివరింపవలసినది.

శ్రీ పరాశరః-

శ్లో॥ అథ జాతు కపిశ్రేష్ఠో ద్రష్టుకామో రఘూత్తమం
కృతకృత్య మహాత్మానం కృత రాజ్యాభిషేచనమ్॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు. పిమ్మట ఒకానొకప్పుడు వానరశ్రేష్ఠుడగు హనుమంతుడు కృత కృత్యుడు, మహాత్ముడునైనవాడు, పట్టాభిషేకము నందిన వాడుఅగు రఘుకులశ్రేష్ఠుడైన శ్రీరామచంద్రుని చూడ గోరినవాడై —

శ్లో॥ జానకీసహితం రామ మయోధ్యాం ప్రతి తో ముదా
గంధమాదన శైలాగ్రా దారూఢ కరభోత్తమః॥

తా॥ జానకీదేవితో కూడిన శ్రీరామచంద్రుని చూడదలచి సంతోషముతో అయోధ్యకు గంధమాదన పర్వతమునుండి బయలుదేరి గొప్ప ఒంటె నెక్కినవాడై

శ్లో॥ క్షణా ద్రాప సాకేతం తద్దర్శన కుతూహలాత్

తా॥ ఆ శ్రీరామచంద్రుని చూచువేడ్కతో క్షణ ములో సాకేతపురమును చేరెను.

శ్లో॥ సాకేతోపవనే రమ్యే కరభా దవతార్య సః
రామపాదాంబుజ ద్వంద్వం దధ్యౌ ధ్యానపరాయణః॥

తా॥ అతడు సాకేతపుర సమీపముననున్న రమ్యమగువనమున ఒంటెనుండిదిగి ధ్యానపరాయణుడై శ్రీరాముని పాదపద్మముల జంటను ప్రార్థించెను.

శ్లో॥ కదా ద్రక్ష్యే రఘుశ్రేష్ఠ పదాంగుష్ఠ నఖప్రభాం
యదా చక్షు శ్చకోరో మే పరాం ప్రీతి మవాప్నుయాత్

తా॥ రఘుకులశ్రేష్ఠుని పాదపు బొటనవ్రేలి గోటి కాంతి నెప్పుడు చూడగలను? ఎప్పుడు చకోరపక్షులవంటి నా కండ్లు మిక్కిలి ఆనందము ననుభవించునోకదా!

శ్లో॥ కదా ముఖాంబుజం సాక్షాత్కరిష్యే పద్మసుందరం
పూర్ణచంద్రోఽపి యే నాస్తే సకళంకో జితప్రభః॥

తా॥ పద్మమువలె సుందరమై పూర్ణచంద్రుడు కూడ కళంకితుడగుటవలన కాంతిలో జయింపబడెనో అట్టి శ్రీరామ చంద్రుని ముఖపద్మమెప్పుడు సాక్షాత్కరించునో కదా!

శ్లో॥ ఇతి సంకల్పసోపాన మారూఢః పవనాత్మజః
రామసింహాసనాభ్యాసం ప్రాంజలిః ప్రతిపద్యత॥

తా॥ అని సంకల్పముల మెట్లెక్కిన హనుమంతుడు అంజలిఘటించి శ్రీరాముని సింహాసన సమీపమును చేరెను.

శ్లో॥ అథోపనిషదాం సారై రప్రమేయం రఘూత్తమం
తుష్టావ పరయా భక్త్యా మారుతి ర్భక్త శేఖరః॥

తా॥ పిమ్మట అనంతుడగు శ్రీరాముని భక్తశ్రేష్ఠుడగు హనుమంతుడు మిక్కిలి భక్తికలవాడై ఉపనిషత్సార భూతములగు స్తోత్రములతో స్తుతించెను.

శ్లో॥ ప్రదక్షిణీకృత్య రఘూత్తమం ప్రభుం
సాకార మారాద్రమచూణచేతసం
ఆనందబాష్పాకుల లోచనాన్తరః
కృతప్రణామో హనుమన్మహోత్సవః॥

తా॥ ప్రకాశించుమనస్సు రూపము దాల్చినట్లున్న ప్రభువగు శ్రీరామచంద్రుని సమీపముననేచూచి ప్రదక్షిణమొనర్చి ఆనందబాష్పములు వ్యాపించిన కండ్లతో అన్తరము కల్గియున్న హనుమంతుడు నమస్కరించి పరమానందమందెను.

శ్లో॥ స తం సముత్థాప్య కరాంబుజన్మనా
విదేహపుత్రీకృత ధూళిమార్జన
దృఢం పరిష్వజ్య నిజేన వక్షసా
త్రిరేష జిఘ్రా వుపమూర్ధ్ని చాదరాత్॥

తా॥ ఆ శ్రీరాముడును తన హస్తపద్మములతో లేవనెత్తి సీతాదేవియొక్క పరిష్వంగమువలన తనయందేర్పడిన చందనాదిధూళి తొలగునట్లు దృఢముగా తన హృదయమునకు హత్తుకొని ఆదరముతో ఆ హనుమంతుని శిరస్సును ముమ్మారు మూర్కొనెను.

శ్లో॥ వినయావనతం దృష్ట్వా భక్తానుగ్రహ తత్పరః
ప్రపచ్ఛ కుశలం రామో హనూమన్తం దయార్ద్రధీః

తా॥ దయచే ఆర్ద్రమైన, బుద్ధిశాలియైన, భక్తుల ననుగ్రహించుటలో తత్పరుడైన శ్రీరాముడు వినయముతో నమ్రుడై యున్న హనుమంతుని చూచి కుశల మడిగెను

శ్లో॥ అథాబ్రవీ త్కపిశ్రేష్ఠో రామం సత్యపరాక్రమం
జాగ్రతి త్వయి నాథేన పురాణపురుషోత్తమ ॥

తా॥ పిమ్మట సత్య పరాక్రముడగు రామునితో వానర శ్రేష్ఠుడగు హనుమంతుడిట్లనెను- ఓ పురాణ పురుషోత్తమా! నీవే దిక్కుగా జాగరూకుడవై యుండగా-

శ్లో॥ అశుభస్య కుతో వార్తా త్వన్నామస్మృతి వైభవాత్
సర్వత్ర కుశలం విద్ధి త్వత్పాదాసక్త చేతసాం ॥

తా॥ నీ నామస్మరణ మహిమచే ఇక అశుభమును గూర్చి మాటాడనేల? ఓ రామా! నీ పాదములందు భక్తి నిల్పిన మనస్సు కలవారందరు అంతట క్షేమముగా నున్నట్లు తెలిసికొనుము.

శ్లో॥ న హి సూర్యే తప త్యంధ తమ స్సందృష్టిరోధనం

తా॥ ఎందువలనన సూర్యుడు బాగుగ ప్రకాశించుచుండగా చీకటి దృష్టిని నిరోధించలేదు కదా!

శ్లో॥ కి న్త్వదాసీం భవ దృశః పరమానందసాగరే
ఉన్మజ్జితుం న శక్నోమి నిమగ్నో హ్యహ మాగళమ్॥

తా॥ కాని ఇప్పుడు నీవు కౌగిలించి పరమానందము కల్గించితివి. అట్టి ఆనంద సముద్రములో కంఠము వరకు మునిగిన వాడనై పైకి లేవలేకున్నాను.

శ్లో॥ ఇతి వదతి హనూమతి ప్రియార్హే
పున రిదమపి వచోహితం వరేణ్యం
రఘుపతి రపి తస్య భక్తి దార్ఢ్యం
జనకసుతాం ప్రతి వేదఇష్యమాణః ॥

తా॥ అని ఇష్టుడగు హనుమంతుడు పల్కుచుండగా రఘురాముడు భక్తి తత్పరతతో దృఢమై, శ్రేష్ఠమై మేలు కల్గించు ఆ వాక్యములను సీతకు విన్పింప గోరెను.

శ్లో॥ హనుమన్ముద్రికా హైమం మమాంగుళి విభూషణం
ప్రేషితా సత్యలోకాయ బ్రహ్మణః ప్రార్థనావశాత్ ॥

తా॥ ఓ హనుమంతా! నా వ్రేలికి భూషణమైన బంగారపు ఉంగరమును బ్రహ్మ ప్రార్థించుటవలన సత్య లోకమునను పంపియుంటిని.

శ్లో॥ మ ద్వియోగాతురాధీనా వసన్తీ రావణాలయే
మద్యోగేనేవ సంప్రాప్తం ప్రయా త్యర్థతయా సుఖమ్ ॥

తా॥ రావణుని ఆలయమున నుండునదైనా వియోగ బాధ వహించునది నా సన్నిధిని చేరుటవలననే నిజముగా సుఖము నంద గల్గుచున్నది.

శ్లో॥ సైషా భగవతీ సీతా తా మిమాం ద్రష్టు మిచ్ఛతి
త దిమాం ముద్రికాం శీఘ్రు మానయ బ్రహ్మసన్నిధేః

తా॥ ఉత్తమురాలగు ఈ సీత ఆ యుంగరమును చూడగోరుచున్నది కావున బ్రహ్మ సన్నిధి నున్న ఆ ముద్రికను శీఘ్రముగా తీసికొనిరమ్ము.

శ్లో॥ ఇ త్యాదిష్టః కపి శ్రేష్ఠో రఘునాథేన ధీమతా
మనో వేగ సమాయుక్తో బ్రహ్మలోకం జగామ సః ॥

తా॥ అని రఘువీరుడు ధీమంతుడునగు రామునిచే ఆదేశింపబడినవాడై వాయు వేగముతో హనుమంతుడు బ్రహ్మలోకమునకు వెడలెను.

శ్లో॥ త మాగతం హనూమన్తం సనకాది మహౌజసః
దృతం నివేదయాంచక్రే బ్రహ్మణే పరమేష్ఠినే ॥

తా॥ అట్లు వచ్చిన హనుమంతుని గూర్చి తేజస్సంపన్నులగు సనక సనందనాదులు వెంటనే పరమేష్ఠియగు బ్రహ్మకు తెలియజేసిరి.

శ్లో॥ త చ్ఛ్రుత్వా వచనం తేషాం సర్వలోక పితామహః
ప్రత్యుజ్జగామ వేగేన పూజా మాదాయ పాణినా ॥

తా॥ వారి మాటలన్నిటిని విని సర్వలోకములకు తాత యగు బ్రహ్మ చేతితో పూజాద్రవ్యములు స్వీకరించి వేగముగా ఎదురు వచ్చెను.

శ్లో॥ అథ ద్వారాన్తరే ద్వౌ తు కపీశ కమలాసనౌ
పరస్పరం నిరీక్షన్తౌ పరమాం ముద మాపతుః ॥

తా॥ అంతట హనుమంతుడు, బ్రహ్మయు నిద్దరు

ద్వారమున పరస్పరము ఒకరి నొకరు చూచుకొని పరమా నందమందిరి.

శ్లో॥ పరస్పరం ప్రశంసన్తౌ ప్రణమన్తౌ పరస్పరం
అన్యోన్య మాశిషంతౌ చ కుశలం పర్యపృచ్ఛతాన్ ॥

తా॥ ఒకరినొకరు ప్రశంశించుకొనుచు, పరస్పరము నమస్కరించు కొనుచు, ఒకరినొకరాశీర్వదించుకొనుచు కుశల ప్రశ్నములు వైచుకొనిరి.

శ్లో॥ తతః పూజాం తు లోకేశో గ్రాహయిత్వా కపీశ్వరం
సరస్వతీ విలాసాఢ్య మాని న్యే యోగమందిరే
తత్రోపవిష్ట హనుమాన్ బ్రహ్మణం పర్యభామత ॥

తా॥ పిదప బ్రహ్మదేవుడు హనుమంతుని సంపూజించగా సరస్వతీ విలాసముచే ప్రసిద్ధమైన యోగ మందిరమున కూరుచుండి హనుమంతుడు బ్రహ్మదేవునితో మాటలాడెను.

శ్లో॥ ఆగతోఽస్మి మహాభాగ రాఘవ స్యానుశాసనాత్
రామేణ ప్రేషితా పూర్వం ముద్రికా హేమనిర్మితా ॥

తా॥ ఓ మహానుభావా! శ్రీరామచంద్రుని ఆజ్ఞపై వచ్చితిని. పూర్వము బంగారముతో చేయబడిన ముద్రిక రామునిచే పంపబడినది.

శ్లో॥ అతులా రత్నఖచితా కోటిసూర్య సమప్రభా
వినోదయతి వై దేహీ యయా తస్య ప్రియా న్వహమ్ ॥

తా॥ అది సాటిలేని రత్నములచే పొదగబడినది. కోటి సూర్యులతో సమానమగు కాంతికలది. దానిచే ఆ శ్రీరాముని భార్యయగు జానకి ప్రతిదినము ఆనందము నను భవించుచుండును.

శ్లో॥ వంచయిత్వా ప్రియాం రామో భవతః ప్రార్థనావశాత్
అనుమేనే దయాసింధుః సత్యలోకే ప్రతిష్ఠితామ్ ।
త్వా మియం పున రానేతుం బ్రహ్మ న్నర్హసి ముద్రికామ్॥

తా॥ నీవు ప్రార్థించుట వలన శ్రీరాముడు తన ప్రియురాలగు సీతను వంచించి దయామయుడగుట వలన సత్యలోకము నందుంచుట కంగీకరించెను. ఓ బ్రహ్మదేవా! ఆ ముద్రికను నీవు ఇక తీసికొని రాదగును.

శ్లో॥ ద్రష్టుం వాంఛతి వైదేహీ తస్య ప్రాణసమా ప్రియా
యయా విరహితా సాధ్వీ న సుఖం విందతే క్వచిత్ ॥

తా॥ ఆ రాముని ప్రాణ సమానయగు ప్రియురాలైన సీత దానిని చూడ గోరుచున్నది. ఉత్తమురాలగు జానకి ఆ ఉంగరము లేకున్న ఏ మాత్రము సుఖమందజాలదు.

శ్లో॥ త దత్ర భగవ న్నద్య మా కృథా కాలయాపనా
పంచప్రాణా హి వైదేహ్యాః ముద్రికాయాం తు ముద్రితాః
దేహమాత్రం తు తత్రాస్తే తస్మా ద్దాతృత్వ మర్హసి ॥

తా॥ ఓ మహాత్మా! సీతయొక్క పంచప్రాణములు ఆమె ముద్రికయందే యున్నవి. కావున ఇప్పుడేమాత్రము

కాలయాపన చేయవలదు. కేవలము దేహ మాత్రముతో అచ్చట ఆమె యున్నది. కాన వెంటనే నీ వీయవలెను.

శ్లో॥ ఇత్యుక్తవన్తం ప్లవగేశ్వరం తథా
నయేన యుక్తం వినయాన్వితం వచః
బ్రహ్మోఽపి ధర్మాన్విత మేన మూచివాన్
రఘుప్రవీ రాంగుళిముద్రి కాదరాత్॥

తా॥ ఇట్లు న్యాయసమ్మతముగాను వినయముగాను చెప్పుచున్న వానరాధీశుడగు హనుమంతుని మాటలు విని శ్రీరామ ముద్రికయందలి ఆదరముతో బ్రహ్మ ధర్మయుక్తముగా నిట్లు పలికెను-

శ్లో॥ న సాంప్రతం సంప్రతి ముద్రికార్పణం
పున ర్హనూమన్ రఘునాయకాయ తే
యత స్స్వ మూర్తి ప్రతిబింబచుంబితాం
అదత్త మహ్యాం స్వయమేవ తాం ప్రభుః॥

తా॥ ఓ హనుమంతుడా! నీ రఘునాయకునకు ఇప్పుడు మరల ముద్రికను సమర్పించుకొనుట యుక్తముకాదు. ఏల నన తన విగ్రహముయొక్క ప్రతిబింబము చక్కగాకల ఆ ముద్రికను ఆ ప్రభువే స్వయముగా నాకిచ్చెను.

శ్లో॥ త మ్మూర్తి మేన తాం మత్వా తత్పూజన పరాయణః
నయా మ్యహం దినా న్యాశు తద్వియోగార్తి మస్మరన్॥

తా॥ ఆ ముద్రికనే అట్టి శ్రీరామచంద్రమూర్తిగా తలచి ఆ రీతిగా శ్రీరామ పూజాపరాయణుడనై నేను అతని వియోగమునెంచక శీఘ్రముగాదినములను గడుపుచున్నాను.

శ్లో॥ చిత్తశుద్ధప్రదాం భూయః పరమానంద కారణాం
నోత్సహే తాం పున ర్దాతుం రాఘవేణ ప్రసాదితామ్॥

తా॥ పరమానందకారణము, మిక్కిలి చిత్తశుద్ధిని కల్గించునది, శ్రీరామచంద్రునిచే ఈయబడినది యగు ఆ ముద్రికను తిరిగి ఇచ్చుట కిష్టపడను.

శ్లో॥ త ద్గచ్ఛసి పున ర్గన్తుం మతిమన్ సూ చిరం కపే!
యావ న్మనసి సీతాయాః న కోపః పర మావహేత్॥
తావ ద్విజ్ఞాపయ ప్రాజ్ఞ సీతాయై మర్లభాం కృతామ్॥

తా॥ కావున ఓ బుద్ధిమంతుడవగు వానరేశ్వరా! సీతయొక్క మనస్సులో మిక్కిలి కోపముకలుగనంతటి సమయములో నీవు తిరిగి వెళ్ళవలసినది. ఓ ప్రాజ్ఞుడా! సీతకు కోపము కలుగనట్లుగా ముద్రిక లభింపని విషయమును తెలియజేయ వలసినది.

శ్లో॥ ఇతి తద్వచనం శ్రుత్వా మారుతి ర్భీమవిక్రమః
భృశకోపపరీ తాత్మా కాలాగ్నిసదృశోఽభవత్॥

తా॥ అను బ్రహ్మవాక్కులను భయంకర పరాక్రమముకల వాయునందనుడు విని మిక్కిలి కోపమందినవాడై ప్రళయకాలాగ్నితో సమానుడుగా నయ్యెను.

శ్లో॥ ఇద మాహ చతుర్వక్త్రం హనుమా న్పార్వతీసుతః
లోకేశతా మదేనైవ న యుక్తం జ్ఞాయతే త్వయా॥

తా॥ పార్వతీనందనుడగు హనుమంతుడు చతుర్ముఖ బ్రహ్మతో ఇట్లనెను. ఓ బ్రహ్మ! లోకేశుడనను మదముతో నీకు యుక్తాయుక్త జ్ఞానము లోపించినది.

శ్లో॥ యతో న దీయతే ముద్రా రామనామాంకితా విధే
న కదాచి ద్రఘూణాం హి నిదేశ్య ప్రతిహన్యతే॥

తా॥ ఎందువలన నన నీవు రామనామాంకితమైన ముద్రను ఈయకుంటివి ఓ బ్రహ్మ! ఎన్నడును రఘువీరుల ఆదేశము తిరస్కరింపబడదు.

శ్లో॥ తథాపి జగదీశస్య రామచంద్రస్య మత్ప్రభోః
చరాచర మిదం కృత్స్నం తదాజ్ఞైకవశం పదమ్॥

తా॥ అందును నా ప్రభువగు రామచంద్రుని ఆదేశము తిరస్కరించుట జరుగదు. ఈ చరాచర జగత్తంతయు ఆతని ఆజ్ఞయే ప్రధానస్థానముగా కలది.

శ్లో॥ యత్ప్రసాదేన లబ్ధో హి త్వ మిమా మధికారితాం
తదాజ్ఞా మవజానాసి దుర్లభా హి కృతజ్ఞతా॥

తా॥ ఎవరి అనుగ్రహమువలన నీవీ అధికారమును పొందితివో ఆతని ఆజ్ఞనే తిరస్కరించుచుంటివి. లోకమున కృతజ్ఞత యనునది లేకపోయెను కదా!

శ్లో॥ త దిదం రఘునాథస్య నిదేశకరణోద్యమః
జీవ న్నహం న పశ్యేయం తదాజ్ఞోల్లంఘనం క్వచిత్॥

తా॥ కావున రఘురాముని ఆదేశమును తిరస్కరించు ప్రయత్నమును ఆతని ఆజ్ఞను మీరుటను నేను బ్రతికుండగా చూచి సహించను.

శ్లో॥ బ్రహ్మా న్న దీయతే ముద్రా యది నిశ్చితచేతసా
అచిరా ద్ద్రక్ష్యసే నూనం తస్యేదం కర్మణః ఫలమ్॥

తా॥ ఓ బ్రహ్మా! నిశ్చితబుద్ధితో నీవు ముద్రికనీయకున్నచో తొందరలోనే దానికి తగిన కర్మఫలమును చూడగలవు.

శ్లో॥ ఇత్యుక్త్వా వచనం సద్యో రామనామానుచిన్తయన్
సేంద్రం సశేషం సబ్రహ్మ సగంధర్వాన్ సురాసురాన్॥

తా॥ అనిపల్కి వెంటనే రామనామము స్మరించుచు సశేషంగా ఇంద్రునితో సహ గంధర్వులను, సురలనూ, అసురులను

శ్లో॥ ఉద్ధరిష్యే జగత్సర్వ మితి నిశ్చిత్య చేతసా
వవృధే భీమకర్మాసౌ ప్రావృషేవ ఘనాఘనాః॥

తా॥ ఈ జగత్తంతను పెళ్ళగించి వైచెదనని మనసార నిశ్చయించుకొని వర్షాకాలమేఘములవలె భయంకర కర్మకల హనుమంతుడు దేహమును పెంచనారంభించెను.

శ్లో॥ ఖడ్గవింశతి సన్నద్ధం భుజవింశతి మండలః
సింహాసంహననోపేతః సమవర్ధత కేసరః॥

తా॥ ఇరువది ఖడ్గములు, సన్నద్ధములై యున్న ఇరువది భుజములు కలవాడు, సింహమువంటి దేహము కలవాడు, బాగుగా వ్యాపించిన జూలుకలవాడు,

శ్లో॥ రక్తాక్షో భీమవదనః తీక్ష్ణ దంష్ట్రో భయంకరః
సింహనాదం నినాదోచ్చైః అట్టహాసం చకార సః॥

తా॥ ఎఱ్ఱని నేత్రములు కలవాడు, భయంకరమైన ముఖము కలవాడు, తీక్ష్ణములైన కోరలుకలవాడు, భయంకరమైనవాడు, అగు హనుమంతుడు అట్టహాసము చేయుచు బిగ్గరగా సింహనాదమొనర్చెను.

శ్లో॥ తం తథావిధ మాలోక్య బ్రహ్మలోకః పితామహః
భయాకులమనా స్తూర్ణం స పరీవారమండలః॥

తా॥ ఆ రీతిగానున్న హనుమంతుని బ్రహ్మలోకము, బ్రహ్మ సపరివారముగా చూచి మిక్కిలి భయముతో కలత జెందిరి.

శ్లో॥ త మద్భుతాకారధరం కపీశ్వరం
సమస్తతా లోచన విశ్వతో ముఖం
విధి ర్విలోక్యా ప్రతిమాన తేజసం
దురంతచింతాం సమవాప మానసః।

తా॥ అట్టి అద్భుతాకారము కల్గి విశ్వతోముఖముగా అంతట కండ్లు కలిగియున్న వానర శ్రేష్ఠుని, ఎదురింప నలవి

కాని వానిని చూచి పరివారముతో కూడిన బ్రహ్మ విపరీత ముగ విచారమందెను.

శ్లో॥ కి మేష సర్వస్య విపర్యయోఽపి వా
మమైవ బుద్ధే స్తు విపర్యయో ఽథవా
అకాల సంహ ర్తు విధిత్సయా హరః
కి మీదృశం రూప మగా ద్బతాథవా॥

తా॥ ఏమిది? లోకమంతయు తారు మారయినదా? లేక నా బుద్ధికే తారుమారుగానున్నదా? అకాలముగా సర్వమును హరింప దలచివాడై పరమశివుడు ఇట్టిరూపము ధరించెనా ఏమి ?

ఇతి శ్రీ పరాశరసంహితాయాం
పరాశర మైత్రేయ సంవాదే
విశ్వరూపదర్శనం నామ
త్రిపంచాశత్పటలః

చతుఃపంచాశత్పటలః

## భవిష్యద్బ్రహ్మతా ప్రభావ కథనం

శ్రీ పరాశరః–

శ్లో॥ అథావలోకయాంచక్రే సనకాదీన్ సభాసదః
ఇతికర్తవ్యతాబుద్ధి విహీనో విశ్వసృట్ తథా॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు. హను

మంతుని ఆ భయంకరమగు ఆకారమును చూచి ఏమిచేయు టకు తోచనివాడై బ్రహ్మ సభలోనున్న సనకాదులను చూచెను.

శ్లో॥ బుద్ధయో విదుషాం చాపి విపద్యన్తే విపత్తిషు

తా॥ ఆపదలయందు విజ్ఞుల బుద్ధులుకూడ సరిగా పని చేయవు.

శ్లో॥ సనత్కుమారః ప్రోవాచ బ్రహ్మాణం విగతవ్యథః
ధైర్య మాస్థాయ తేజస్వీ తపోబల సమన్వితః
భగవ న్భారతీనాథ దీయతాం రామముద్రికా॥

తా॥ తేజోవంతుడు. తపోబలముతో కూడియున్న వాడు అయిన సనత్కుమారుడు భయమువీడి, ధైర్యము వహించి బ్రహ్మతో ఇట్లనెను- ఓ భగవంతుడా! సరస్వతీ నాథా! రామముద్రికను హనుమంతునకీయవలసినది.

శ్లో॥ దానేనైవ ప్రతీకార్యో న సామ్నా కేవలేన వై

తా॥ ఏలనన ముద్రికాదానమే చేయదగినపని కాని కేవలము సామోపాయముతో మంచిమాటలు చెప్పి సాధించ లేము. దానోపాయమే కర్తవ్యము.

శ్లో॥ సనత్కుమారవచనం శ్రుత్వా బ్రహ్మసభాసదః
అన్వమోద న్త సంవాదం జగతాం హితకామ్యయా॥

తా॥ సనత్కుమారుడు పల్కిన పల్కులను లోక హితార్థము బ్రహ్మ సభయందలి వారందరామోదించిరి.

శ్లో॥ ఏవం నివేదితం పథ్యం సూనునా భావితాత్మనా
ఈదృశ వ్యసనే ప్రాప్తే హిత మేవే త్యమస్యత॥

తా॥ ఈ రీతిగా ఆత్మజ్ఞానియగు మానసపుత్రునిచే చెప్పబడిన యోగ్యమార్గము గూర్చి విని బ్రహ్మ ఇటువంటి కష్టసమయమున అదియే మేలని తలచెను.

శ్లో॥ అథ తుష్టావ విధివ ద్విధిః ప్రీతిపురస్సరం

తా॥ అంతట బ్రహ్మ సంప్రీతుడై యథావిధిగా నిట్లు స్తోత్రము చేసెను.

శ్లో॥ ఉష్ట్రారూఢ సువర్చలాసహచరన్ సుగ్రీవ మిత్రాంజనా
సూనో వాయుకుమార కేసరితనూజా ఒక్షాది దైత్యాంతక
సీతాశోకహరాగ్నినందన సుమిత్రాసంభవప్రాణద
శ్రీభీమాగ్రజ శంభుపుత్ర హనుమన్ పంచాస్య తుభ్యం నమః॥

తా॥ ఓ ఒంటె నెక్కినవాడా! సువర్చలాపతీ! సుగ్రీవసఖుడా! అంజనాపుత్రా! వాయువరమున జన్మించిన వాడా! కేసరినందనా! అక్షాదిరాక్షసుల సంహరించిన వాడా! సీతా శోకమును పోగొట్టినవాడా! అగ్నిచే ధరింపబడిన శివతేజస్సునుండి పుట్టినవాడా! లక్ష్మణునకు ప్రాణము లొసగినవాడా! భీమునకు అన్నయైనవాడా! శివుని తేజమున జనించినవాడా! పంచముఖములు కలవాడా! హనుమంతా! నీకు నమస్కారము.

ఖడ్గం, ఖేటక, భిండివాల, పరశుం, పాశ, త్రిశూల, ద్రుమాన్
చక్రం,శంఖ,గదా,ఫలాం,కుశ,సుధాకుంభాన్ హలం,పర్వతం
టంకం పర్వాశ కార్ముకాహి డమరూ నేతాని దివ్యాయుధా
న్యేవం వింశతిబాహుభిశ్చదధతంధ్యాయే హనూమత్ప్రభుమ్

తా॥ కత్తిని, డాలును, ఇనపములికికల ఆయుధమును గొడ్డలిని, త్రాటిని, త్రిశూలమును, వృక్షమును, చక్రమును శంఖమును, గదను, ఫలమును, అంకుశమును, అమృతభాండము, నాగలిని, పర్వతమును, ఉలివంటి యాయుధమును, కొండను, వింటిని, సర్పము ను, డమరుకము అను నీ దివ్యములగు ఇరువది ఆయుధములను ఇరువది చేతులందు ధరించినట్టి హనుమంతుని ధ్యానింతును.

శ్లో॥ ఇత్యేవ మంజనాపుత్రం ప్రసన్నీకృత్య విశ్వసృట్
తస్య ప్రదర్శయాంచక్రే సరసీ ముద్రికాశ్రయాన్॥

తా॥ అని ఇట్లు అంజనా సుతుడగు హనుమంతుని ప్రసన్నుని చేసికొని బ్రహ్మ ఆతనికి ముద్రికలుకల సరస్సులను చూపెను.

శ్లో॥ అనంత రామావతారేషు ముద్రికాః
చతుర్ముఖ ప్రార్థనయా సముత్థితాః
కృతాస్పదా యత్ర సుధాస్వాస్పదే
నిగర్శయామాస సర స్తదాత్మనా॥

తా॥ అంతులేని రామావతారము లన్నిటను చతుర్ముఖబ్రహ్మ ప్రార్థనవలన రామునిచే సమర్పింపబడిన రామ ముద్రికలన్నియు అమృతమయమగు సరస్సుల యందుంచ బడినవి. వానిని బ్రహ్మ హనుమంతునకు చూపెను

శ్లో॥ తత స్తత్వర ముత్థాయ సుధాసరసి మారుతిః
నిమజ్జయ బహూ నాశు ముద్రికాగ్రహణేచ్ఛయా॥

తా॥ పిమ్మట వెంటనేలేచి హనుమంతుడు అనేక రామముద్రికలను తీసికొన నెంచినవాడై ఆ అమృత సరస్సు నందు మునిగెను.

స దృష్ట్వా బహుశో ముద్రాన్ రామనామాంకితాన్ శుభాన్
విస్మయం పరమం ప్రాప్తః పరాం ప్రీతి మవాప సః॥

తా॥ హనుమంతుడచ్చట శుభప్రదములగు రామ నామాంకిత ముద్ర లనేకము చూచి మిక్కిలి ఆశ్చర్యపడి అత్యంతము సంతోషమందెను.

శ్లో॥ నమ శ్చకార వేగేన సప్రదక్షిణపూర్వకం
ప్రత్యేకం ముద్రికాణాం వై కృతాంజలిపుటః కపిః॥

తా॥ ప్రత్యేకముగా ముద్రికలకు అంజలి ఘటించి హనుమంతుడు వేగముగా ప్రదక్షిణ పూర్వక నమస్కారము లొనర్చెను.

శ్లో॥ ఉన్మజ్జ సరస స్తూర్ణం బ్రహ్మాణ మభివాద్య చ
నివేద కుశలం తస్మై రఘునాథ మగా త్పునః॥

తా॥ ఆ సరస్సున మిక్కిలిగ మునిగి బ్రహ్మకు నమస్కరించి కుశలప్రశ్నానంతరము మరల శ్రీరామచంద్రుని చేరెను.

శ్లో॥ త మాగతం కపిం దృష్ట్వా ప్రహసన్ రఘునందనః
అబ్రవీ న్మధురం వాక్యం సాదరం వదతాంవరః॥

తా॥ ఆ వచ్చిన హనుమంతునిచూచి మాట నేర్పరియగు రఘురాముడు చిరునవ్వు నవ్వుచు ఆదరపూర్వకముగా మధురవాక్కులతో నిట్లనెను-

శ్లో॥ హనుమన్ దీయతాం ముద్రా సీతాయై రత్నభూషితా
య ద్విలంబ విషాదేన ప్రియాం మే నాభిధత్సతి॥

తా॥ ఓ హనుమంతా రత్నభూషితమగు ఆ ముద్రను సీతకీయవలసినది. ఏలనన అదిలేని దుఃఖము కారణముగా నాకానందము చేకూరదు.

శ్లో॥ ఇతి తస్య వచనం శ్రుత్వా తదాజ్ఞాభంగ శంకయా
కర్ణౌ విలుంఠ్య సన్త్రస్తో యయౌ పశ్చాచ్ఛనైశ్శనైః॥

తా॥ అనగా ఆ రాముని మాటలు విని రామాజ్ఞకు భంగమాయెనను శంకకలవాడై చెవులు కప్పుకొని, భయమందినవాడై నెమ్మదిగా వెనుకకు మరలెను.

శ్లో॥ అలబ్ధ ముద్రికాం జ్ఞాత్వా చేష్టయా వాయునందనం
జగాద సస్మితం వాక్యం కౌసల్యానందవర్ధనః॥

తా॥ అతని చేష్టలవలననే వాయునందనుని ముద్రిక

తేని వానినిగా గుర్తించి కౌసల్యకు మిక్కిలి ఆనందము కలి
గించు కుమారుడైన శ్రీరాముడు నవ్వుచు ఇట్లుపలెకెను-

శ్లో॥ ఇత ఏహి కపిశ్రేష్ఠ మాభైషీ ర్భక్తశేఖర!
ఆవయో రన్తరం నాస్తి బింబప్రతిమయో రివ॥

తా॥ ఓ వానరశ్రేష్ఠా! ఇటురమ్ము. ఓ భక్తవరుడా
భయమువలదు బింబము, ప్రతిమలకువలె మనకు భేదములేదు.

శ్లో॥ తథాపి బ్రహ్మలోకస్య వృత్తాంతం వక్తు మర్హసి
ఏవ ముక్తః కపిశ్రేష్ఠో రామేణ ప్రియవాదినా।
ప్రత్యువాచ యథాదృష్టం వచనం వదతాంవరః॥

తా॥ అయినను నీవు చూచిన బ్రహ్మలోకపు వృత్తాం
తమును చెప్పవలయును అని ప్రియముగ మాటాడు రాముడు
పలుకగా వానరప్రముఖుడగు, మంచిమాటకారియగు, హను
మంతుడు చూచినది చూచినట్లుగా ఇట్లు సమాధానమిచ్చెను.

శ్లో॥ భగవన్ బ్రహ్మణో లోకః పుణ్యా రాశిరివాపరః
యం దృష్ట్వా పరమాశ్చర్యం ప్రాప్తోస్మి రఘునందన॥

తా॥ ఓ భగవంతుడా! రామచంద్రా! ఆ బ్రహ్మ
లోకము ఒక పుణ్యరాశి. ఓ రామా! అటువంటి బ్రహ్మ
లోకమునుచూచి పరమాశ్చర్య మందితిని.

శ్లో॥ యత్ర సన్నిహితా నిత్యం భారతీ బ్రహ్మణో వధూః
సర్వవర్ణమయీ సాధ్వీ యస్యాం సర్వం ప్రతిష్ఠితమ్॥

తా॥ ఆ బ్రహ్మలోకమున బ్రహ్మయొక్క పత్నియు,

సర్వవర్ణ సమామ్నాయము తానే యైనదియు, ఉత్తము రాలును అగు సరస్వతి ఎల్లప్పుడు సన్నిహితయైయుండును. జ్ఞానరూపమున లోకమంతయు ఆమెయందే సుప్రతిష్ఠితమై యున్నది.

శ్లో॥ యత్ర స్థిత మహాత్మానః సర్వ వేదాన్త పారగాః
వేదవాద రతా నిత్యం జితక్రోధా జితేంద్రియాః॥

తా॥ అచ్చట నున్నటువంటి మహాత్ములందరు వేదాంత మంతయు సాకల్యముగ నెరిగినవారు, ఎల్లప్పుడు వేదవిషయ ములు చర్చించువారు, క్రోధమును జయించినవారును, ఇంద్రియ నిగ్రహముకలవారును.

శ్లో॥ అహోభాగ్య మహోభాగ్యం సత్యలోకనివాసినాం
రామనామామృతో యస్మాత్పాయయన్తి పిబన్తి చ॥

తా॥ ఆశ్చర్య మాశ్చర్యము! సత్యలోక వాసుల దెంతటి యదృష్టము! ఏలనన ఎల్లప్పుడు వారు రామనామా మృతమును త్రాగుచు త్రాగించుచు నుందురు.

శ్లో॥ సర్వే చ కృతకృత్యాశ్చ సర్వే యోగపరాయణాః

తా॥ ఆ సత్యలోకమున నున్న వారందరు కృత కృత్యులు, యోగపరాయణులును.

శ్లో॥ కల్లోల మాలికా లోల కనకాంబుజ పాళికం
సరో హరితి చేతాంసి సుధామయ రసాశయం॥

తా॥ అచ్చటనున్న సరస్సు అలలచే కదలెడి బంగారు

పద్మములు కలదై, అమృతమయమగు నీటికి నిలయమై చూచువారి మనస్సుల నాకట్టుకొనును.

శ్లో॥ యన్మధ్యే బహవో దృష్టా రామనామాంక ముద్రికాః
అన్యత్ర దుర్లభాః పృథ్వాం త్వత్ప్రసాద ఇవ ప్రభో ॥

తా॥ ఓ మహానుభావా! ఆ సరస్సు యొక్క మధ్య భాగమున నీ యనుగ్రహమూ అనునట్లు మరెచ్చటను లభింపని రామనామాంకిత ముద్రికలనేకములున్నవి.

శ్లో॥ తథాపి భూయసీ భక్తి ర్నవతా మేవ గాహతే
యద్విధిర్భక్తిలోభాభ్యా ముద్రా న్నాదర్శయ న్మమ॥

తా॥ అట్లయినను అచ్చట మిక్కిలియగు భక్తి క్రొత్తదనము సంతరించుకొన్నది. ఏలనన బ్రహ్మ భక్తి లోభములవలన నాకు రామ ముద్రికలు చూపనేలేదు.

శ్లో॥ తదా కోపపరీతాత్మా విశ్వరూప మదర్శయం

తా॥ అప్పుడు మిక్కిలి కోపమందినవాడనై విశ్వరూపమును ప్రదర్శించితిని.

శ్లో॥ భవ త్పాదాంబుజధ్యాన వైభవా ల్లబ్ధవైభవః
ఉద్ధృత్య సకలాన్ లోకా నహ మాగన్తు ముద్యతః ॥

తా॥ నీ పాదపద్మములను ధ్యానమొనర్చిన కారణమున లభించిన శక్తితో సమస్తములైన లోకములను ఎత్తుకొని వచ్చుటకో యన్నట్లుద్యమించితిని.

శ్లో॥ పున స్సనత్కుమారేణ భవన్మహిమ వేదినా
సౌమ్యతాం ప్రాపితోఽస్మ్యేష తద్భయం హర్తు మిచ్ఛతా

తా॥ ఇంతలో నీ మహిమనంత నెరిగిన సనత్కుమారుని వలన వెంటనే నేను సౌమ్యత నందితిని. ఆ భయమును పోగొట్టుకొన నెంచినట్టి-

శ్లో॥ దర్శితా సరసీ మహ్యాం తదోబ్ధితేన విరించినా
తత్ర దృష్టా మయా బహ్వ్యో భవన్నామాంక ముద్రికాః॥

తా॥ సనత్కుమారుని చే ఉద్బోధితుడై నట్టి బ్రహ్మ చే నాకు సరస్సు చూపబడినది. అచ్చట తమ నామము ముద్రింపబడిన ముద్రికలు పెక్కు నాకు కన్పడినవి.

శ్లో॥ కృతప్రదక్షిణ స్తాసాం సాష్టాంగం ప్రణతోఽస్మ్యహం
తదా చిన్తాం సమగమం దృష్ట్వా త్వన్నామముద్రికాః

తా॥ వానికి ప్రదక్షిణ మొనర్చి నేను సాష్టాంగ నమస్కారము చేసితిని. నీ నామము కల ఆ ముద్రికలను చూచి నేను ఆలోచనలో పడితిని.

శ్లో॥ కదా మయా హి సంగ్రాహ్యా రామాజ్ఞా వశవర్తినా
సర్వా హి రామనామాంకాః నైకత్రాస్తి విరూపతా॥
న గ్రాహ్య స్సకలా ముద్రా స్తదాజ్ఞావచన క్రమాత్।

తా॥ రామాజ్ఞకు వశుడనై ప్రవర్తించు నేను ముద్రిక నెప్పుడు గొంపోదును? అన్నియు రామనామాంకిత ముద్రలే. ఎచ్చటను భేదము లేదు. అతని ఆజ్ఞ ప్రకారము అన్ని ముద్రి లను తీసుకొని వెళ్ళుటయు తగదు.

శ్లో॥ ఇతి సంశయ మాపన్నః త్వ దాజ్ఞాభంగ కాతరః
ఆగతోఽస్మి రఘు శ్రేష్ఠ తవ పాదాంతికం ప్రభో ॥

తా॥ అని సందేహము కల్గినవాడనై నీ యాజ్ఞకు భంగ మేర్పడునని భయపడి ఓ రఘువంశ శ్రేష్ఠా! మరల నీ పాదముల చెంతకే వచ్చితిని.

శ్లో॥ ఇత్యుక్త వచనం రామో హనుమన్త మథాబ్రవీత్
ప్రీతోఽస్మి తవ భక్త్యాఽహ మితరై ర్దురవాపయా ॥

తా॥ అని పల్కినట్టి హనుమంతునితో రాము డిట్లనెను- ఓ హనుమంతా! ఇతరులకు పొందశక్యము కాని నీ భక్తికి నేను సంప్రీతుడనైతిని

శ్లో॥ వరం వరయ భద్రం తే మా కురు ష్వాత్ర సంశయం
బహవో హ్యవతారా మే సమతీతా శ్చ భావినః
వర్తతే హ్యవతారోఽయం తత్త త్కార్యవశానుగః ॥

తా॥ నీకు శుభమగుగాక! వరమును కోరుకొనుము. ఇందు సందేహించవలదు వెనుక నా అవతారము లెన్నియో గడచినవి. ఆయా కార్యములు సాధించుటకుగాను ఈ అవతారమిప్పుడున్నది.

శ్లో॥ బ్రహ్మణే మమభక్తాయ త్వాదృశాయ యతాత్మనే
మమ ప్రతినిధి ర్ముద్రా ప్రతికల్పం ప్రదీయతే ॥

తా॥ నీ వలె ఆత్మ సంయమనము కల్గిన నా భక్తుడైన బ్రహ్మకు ప్రతికల్పమునందు నాకు ప్రతినిధియగు ముద్ర ఈయబడుచున్నది.

శ్లో॥ అతులాం ముద్రికాం రమ్యాం నిధా యామృత సాగరే
ఉపచారై ర్బహువిధై ర్మామే వాభ్యర్చయన్ విధిః ॥

తా॥ సాటిలేని రమ్యమగు ముద్రికను అమృతమయమగు సరస్సున నుంచి బ్రహ్మ నన్నర్చించిన రీతిగానే దానిని బహువిధములగు నుపచారములతో పూజించుచున్నవాడై-

శ్లో॥ నిత్యోత్సవం కరో త్యేషో హ్యుత్తరోత్తర బృంహితం
తా॥ నానాటికి గొప్పగా ఆతడు నిత్యోత్సవము చేయుచున్నాడు.

శ్లో॥ ఏవం ప్రపూజయ న్బ్రహ్మ నిర స్తాన్య ప్రయోజనః
మహతీం ముద మాప్నోతి నిక్షేపే నైవ నిర్ధనః ॥

తా॥ ఇట్లు ఇతర ప్రయోజనములు వీడి బ్రహ్మ పూజ సల్పుచు దరిద్రుడు నిధి దొరకుటచే సంతసించినట్లు నా పూజ వలననే మిక్కిలి ఆనందమందు చున్నాడు.

శ్లో॥ అతః కపీంద్ర! మే ముద్రా బ్రహ్మసత్కారలోభితా
సుధాసరసి వర్తన్తే సంచితాయ పరార్ధశః ॥

తా॥ కావున ఓ వానరవీరా! నా ముద్రలు పరార్ధమును సంతరించుకొనుచు బ్రహ్మ సత్కారమందలి లోభముతో అమృత సరస్సు నందున్నవి.

శ్లో॥ సీతా మనోవినోదాయ కాంచి దేకా మిహానయ
తయా క్రీడతు వై దేహీ బాల్యే పుత్రికయా యథా ॥
తా॥ సీతయొక్క మానసికానందముకొరకు వానిలో

నొక దానిని నిచ్చుటకు తీసికొనిరమ్ము. బాల్యమునందు బొమ్మతో ఆడుకొనునట్లు సీత దానితో క్రీడించగలదు

శ్లో॥ పుత్రభావమతి స్తత్ర లంకాదహనం ముదితా త్వయా
వృద్ధి మాప్నోతి నిర్విఘ్నం ముద్రికా దాన గౌరవాత్॥

తా॥ ఓ హనుమంతా! నీ యందు పుత్ర భావముకల ఆమె నీచే ఆ లంకయందు సంతృప్తి బడసినది నిర్విఘ్నముగ ఈ ముద్రిక నిచ్చుటద్వారా తప్పక ఆ తృప్తి అభివృద్ధి నంద గలదు.

శ్లో॥ ఇతి తద్వచనం శ్రుత్వా ప్రేమపర్యాకులాక్షరం
ప్రణమ్య రామపాదాబ్జం ప్రయయౌ వాయునందనః ॥

తా॥ అని పల్కిన ప్రేమపూర్ణములైన రాముని పలుకులను విని హనుమంతుడు రాముని పాదపద్మములకు నమస్కరించి వెడలెను.

శ్లో॥ గత్వా వేగేన మహతా సత్యలోకం నిరంకుశః
జగ్రాహ ముద్రికా మేకాం సుధాసరసి సంస్థితామ్ ॥

తా॥ మిక్కిలి వేగముగా సత్యలోకమునకు వెళ్లి ఎదురు లేనివాడై ఆ అమృత సరస్సునందున్న ఒక ముద్రికను స్వీకరించెను.

శ్లో॥ తాం వహన్ శిరసా యత్నాత్ తదాజ్ఞామివ మారుతిః
సమీపం రఘునాథస్య క్షణాదేవాన్వపద్యత ॥

తా॥ ఆ రామ ముద్రికను ప్రయత్న పూర్వకముగ

రామాజ్ఞ వలె శిరసావహించి వాయునందనుడు క్షణములో శ్రీరాముని చెంతకు వచ్చెను.

శ్లో॥ తతః ప్రాదా త్కపి శ్రేష్ఠః సీతాయై రామముద్రికాం
పశ్యతో రామచంద్రస్య సీతాపర్యంకవర్తినః ॥

తా॥ పిమ్మట వానర వీరుడగు ఆంజనేయుడు ఆ ముద్రికను సీత చెంతనుండి రాముడు చూచుచునే యుండగా సీతకొర కిచ్చెను.

శ్లో॥ తేన దత్తాం శుభాం ముద్రాం స్థితాం భక్తిమివాత్మని
దృష్ట్వా జగ్మతు రానందం సీతారామౌ పరస్పరమ్ ॥

తా॥ తనయందు గల భక్తిని తీసి ఇచ్చినట్లుగా హనుమంతు డిచ్చిన ఆ శుభప్రదమగు ముద్రికను చూచి సీతారాములు పరస్పరము మిక్కిలి ఆనందపుందిరి.

శ్లో॥ అథాబ్రవీ త్కపిం రామః ప్రాంజలిం పురత స్థితః
నిదేశాన్తర లాభాయ నిరీక్షంతం పదాంబుజమ్॥

తా॥ పిమ్మట శ్రీరాముని ఆదేశము గోరుచు తన పాదపద్మముల వైపు ఎదురు చూచుచు అంజలి ఘటించి యున్న హనుమంతునితో ఎదురుగా నున్న రాము డిట్లు పల్కెను.

శ్లో॥ ప్రాప్నుహి త్వం కపిశ్రేష్ఠ బ్రహ్మలోకాధినాథతాం
యతో విలోక్య తం లోకం ఏషాం ప్రతి మాప్తవాన్ ।

తా॥ ఓ వానరశ్రేష్ఠా! నీవు బ్రహ్మలోకమును

చూచి మిక్కిలి ఆనందమందినావు కావున నీవు బ్రహ్మ లోకాధిపత్యమును పొందుదువుగాక!

శ్లో॥ అహం చ పరమప్రీతః తవ భక్త్యా నిరంతయా
త్వయా చ దండకారణ్యే బహుధోపకృతా వయమ్ ॥

తా॥ నేనుకూడ అంతులేని నీ భక్తి వలన మిక్కిలి సంతసించితిని. దండకారణ్యమున నీవలన మేము అనేక రీతుల ఉపకారములందితిమి.

శ్లో॥ ఏకైక స్యోపకారస్య హనుమ న్నాస్తి నిష్కృతిః
అత స్సర్వహితార్థాయ బ్రహ్మలోకాధిపో భవ ॥

తా॥ ఓ హనుమంతా! నీవు చేసిన ఒక్కొక్క ఉపకారమునకుగా ప్రత్యుపకారము చేయలేము. అందుచే సర్వ హితార్థముగా నీవు బ్రహ్మలోకాధిపత్యము నందుము.

శ్లో॥ సృజన్ జగతి సర్వాణి చరాణి స్థావరాణి చ
వేదోపదిష్ట మార్గేణ మమాజ్ఞా మనుపాలయన్
సుఖీ భవ కపిశ్రేష్ఠ భక్తరక్షణ తత్పరః ॥

తా॥ ఓ వానరశ్రేష్ఠుడా! లోకమున చరాచర సృష్టి యంతయు గావించుచు వేదోక్త ప్రకారము సంచరించుచు నా ఆజ్ఞను పాలించుచు భక్తులను రక్షించుచు సుఖముగా నుండుము.

శ్లో॥ ఇతి తస్య ప్రసాదం వై ప్రతిగృహ్య కపీశ్వరః
త మేవ మనసా ధ్యాయన్ గంధమాదన మన్వగాత్ ।

తా॥ అను ఆ శ్రీరాముని అనుగ్రహము బడసి హను మంతుడు ఆ శ్రీరామచంద్రునే మనసార ధ్యానించుచు గంధమాదన పర్వతము చేరెను.

శ్లో॥ యతో మథ్నాతి గంధ్యాస్తైర్మనాంసి ప్రసభం గిరిః
తతో నిగద్యతే సద్భి గంధమాదన ఇత్యసౌ ॥

తా॥ సుగంధ పరిమళముచేత మనస్సులను మథించు నది కావున ఈ పర్వతము గంధమాదన మని పిలువబడు చున్నది.

శ్లో॥ తస్మాద్గంధప్రభావేన సమాకృష్టమనాః కపిః
రేజే రంభావనే రమ్యే గంధమాదన మూర్ధని ॥

తా॥ ఆ కారణమున గంధ ప్రభావముచే ఆకర్షింప బడిన మనస్సు కల హనుమంతుడు గంధమాదన పర్వత శిఖరమున కల రమ్యమగు అరటితోటయందు ప్రకాశించు చుండెను.

శ్రీ పరాశరః -

శ్లో॥ ఏవం హనూమతా ప్రాప్తా బ్రహ్మలోకాధినాథతా
తదాప్రభృతి మైత్రేయ భవిష్యద్బ్రహ్మ నామతా ॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు- ఓ మైత్రేయా! ఈ రీతిగా హనుమంతునకు బ్రహ్మలోకాధిపత్యము లభించెను. అప్పటినుండి హనుమంతునకు భవిష్యద్బ్రహ్మ యను నామము వచ్చెను.

శ్లో॥ ఏకైకాంశో హనుమతః ప్రతికల్పం మహాత్మనః
జాయతే బ్రహ్మరూపేణ లోకానుగ్రహ కామ్యయా ॥

తా॥ లోకానుగ్రహము కొరకై మహాత్ముడగు హనుమంతుని ఒక్కొక్క అంశమే ప్రతికల్పమున బ్రహ్మ రూపమందుచుండును.

శ్లో॥ య ఇదం పుణ్య మాఖ్యానం శ్రుణ్వన్తి చ పఠన్తి చ
తే సర్వే బ్రహ్మణో లోకే పూజ్యన్తే సర్వసమ్మతాః ॥

తా॥ ఈ పుణ్యప్రదమగు హనుమచ్చరితను ఎవ్వరు విందురో, మరియు ఎవ్వరు చదివెదరో వారందరు సర్వసమ్మతముగా బ్రహ్మలోకమున పూజింప బడుదురు.

శ్లో॥ ఏవం ప్రభావో హనుమాన్మహాత్మా
సురాసురణా మపి దుష్ప్రధర్షః
అచేతనానా మపి య ద్గుణోదయః
చినోతి చైతన్యభరం సుధోపమః॥

తా॥ ఇట్టి ప్రభావము కల మహాత్ముడగు హనుమంతుడు దేవదానవులకు తిరస్కరింపదగనివాడై, అచేతనములకును గుణోదయము కల్గించు వాడై అమృత సమమగు చైతన్యమును కూరుచున్నాడు.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం
పరాశర మైత్రేయ సంవాదే
భవిష్యద్బ్రహ్మతా ప్రభావ కథనం నామ
చతుఃపంచాశ త్పటలః

పంచపంచాశ త్పటలః

# జపమాలా లక్షణం

శ్రీ పరాశరః—

శ్లో॥ వక్ష్యామి జపమాలాయా లక్షణం మునిసత్తమ
మాలికా భీజ సఙ్ఖ్యాయా నియమం చ విశేషతః ॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు- ఓ ముని శ్రేష్ఠుడవగు మైత్రేయా! జపమాలా లక్షణమును, మాలికయందు భీజ సంఖ్యా నియమమును విశేషించి చెప్పుచున్నాను.

శ్లో॥ నియతాఽనియతా చేతి ద్వివిధా మాలికా స్మృతా
నియతా మూలమంత్రాయ సదా త్వనియతా భవేత్ ॥

తా॥ జపమాలిక నియత అని, అనియత అని రెండు విధములుగా చెప్పబడుచున్నది. నియత మాలిక మూల మంత్రమును జపించుటకు స్వీకరించునది. మిగిలిన అన్నిటను వినియోగించు మాలిక అనియత మాలిక.

శ్లో॥ మూలమంత్ర జపాద్యర్థాం మాలికాం న ప్రదర్శయేత్
జపన్నపి సదా యోగీ గోముఖే నైవ సంజపేత్ ॥

తా॥ మూలమంత్రజపము కొఱకై ఉంచిన నియతి మాలికను ఇతరులు చూచునట్లు ప్రదర్శింపరాదు. జపించు సమయమునను యోగియగువా డెప్పుడు గోముఖ విధానము ననే జపింపవలెను.

శ్లో॥ తేన మన్త్రాః ప్రసీదంతి జపమాలా నిగూహనాత్
సదా జపోచితా మాలా దర్శనాదేవ దూష్యతి ॥

తా॥ పై నియమములతో జపమాలను రహస్యముగా నుంచి జపించుట వలన మంత్రములు సిద్ధించి అనుగ్రహించును. జపోచితమాల అన్యులు చూచుట వలననే అపవిత్రమగును.

శ్లో॥ రుద్రాక్షైః కమలాక్షై ర్వా స్ఫాటికై ర్వాపి విద్రుమైః
ముక్తాభి స్తులసీకాష్ఠైః కుర్యా ద్వై జపమాలికామ్ ॥

తా॥ రుద్రాక్షలతో కాని, తామరపూసలతో కాని, స్ఫటికములతో కాని, పగడములతో కాని, ముత్యములతో కాని, తులసి కఱ్ఱతో చేయు పూసలతో కాని జపమాలికను తయారు చేయవలయును.

శ్లో॥ స్ఫాటికా మోక్ష మిత్యాహుః ముక్తా కీర్తికరా స్మృతా
రుద్రాక్షా కమలాక్షా శ్చ సర్వసిద్ధి ప్రదాయినః ॥

తా॥ స్ఫటిక జపమాలతో జపించుట వలన మోక్షము సిద్ధించునని చెప్పుదురు. ముత్యముల మాలిక కీర్తిదాయక మని తెలియుచున్నది. రుద్రాక్ష మాలిక, తామర పూసల మాలికయు సర్వసిద్ధుల నొసంగునవి.

శ్లో॥ విద్రుమై రచితా మాలా హ్యాయుర్వృద్ధికరా భవేత్
చిత్తశుద్ధిప్రదాత్యాణాం తులసీకాష్ఠ మాలికా ॥

తా॥ పగడయులచే నిర్మించిన మాలిక ఆయుర్వృద్ధిని కలిగించును. తులసిపూసల మాలిక చిత్తశుద్ధిని కలిగించును.

శ్లో॥ అష్టావింశ త్యుత్తరేణ శతేన జపమాలికాం
ద్వాత్రింశ త్సంఖ్యయా వాపి సప్తవింశతి సంఖ్యయా ॥

తా॥ నూటఇరువదియెనిమిది పూసలతో జపమాలికను తయారుచేయవలెను. ముప్పదిరెండు పూసలతో కాని, ఇరువదియేడు పూసలతోనైనను జపమాలను తయారు చేసికొనవలెను.

శ్లో॥ జపస్య సిద్ధయే సద్యః కుర్యా ద్ద్వాదశసంఖ్యయా
సర్వత్ర ద్వాదశీ సంఖ్యాసంఖ్యానా ముత్తమోత్తమా॥

తా॥ వెంటనే జపము సిద్ధించుటకు పండ్రెండు పూసల మాలికతో జపింపవలెను. అన్ని సంఖ్యలలోను పండ్రెండు సంఖ్య ఉత్తమోత్తమమైనది.

శ్లో॥ పఠే ద్ద్వాదశనామాని మాల యాదిత్యసంఖ్యయా
స్వాభీష్ట సిద్ధయే యోగీ తథా సప్తాక్షరీ మపి
షోడశాక్షరమంత్రం వా హనుమత్ప్రీతయే సదా ॥

తా॥ సూర్యసంఖ్యయగు పండ్రెండు నామములను యోగియగువాడు అభీష్టసిద్ధికై జపింపవలెను. అట్లే సప్తాక్షరీ మంత్రమునుకాని, షడక్షరినికాని హనుమత్ప్రీత్యర్థము జపింపవలెను

శ్రీ మైత్రేయః—

శ్లో॥ స న్త్యనంతాని నామాని భగవన్ హనుమత్ప్రభోః
మన్త్రాశ్చ బహవ స్తస్య సర్వసిద్ధిప్రదా నృణామ్।

తా॥ శ్రీ మైత్రేయులవారడుగుచున్నారు. ఓ మహాను భావా! పరాశర మహామునీ! శ్రీ హనుమంతునకు సంబంధించి అనంతములగు నామములు, అనేక మంత్రములు మానవులకు సర్వసిద్ధిప్రదములై యున్నవి.

శ్లో॥ కాని ద్వాదశనామాని కా వా స్యాత్ షోడశాక్షరీ
కా వా సప్తాక్షరీవిద్యా తన్మమాచక్ష్వ తత్త్వతః ॥

తా॥ వానిలో పై చెప్పిన ద్వాదశనామము లేవి? షోడశాక్షరీ ఏది? సప్తాక్షరీ మహామంత్రమేది? నాకు వానిని వివరముగ జెప్పవలసినది.

శ్రీ పరాశరః—

శ్లో॥ హనూమా న జనీసూనుః వాయుపుత్రో మహాబలః
రామేష్టః ఫల్గుణసఖః పింగాక్షో౽మితవిక్రమః ॥
ఉదధిక్రమణ శ్చైవ సీతాశోక వినాశకృత్
లక్ష్మణప్రాణదాతా చ దశగ్రీవశ్చ దర్పహా ॥
ఇతి ద్వాదశనామాని జప్యాని జపమాలయా ॥

తా॥ శ్రీ పరాశరులవారు ద్వాదశ నామాదికము చెప్పుచున్నారు "హనుమంతుడు, అంజనీసూనుడు, వాయుపుత్రుడు, మహాబలుడు, రామేష్టుడు, ఫల్గుణసఖుడు, పింగాక్షుడు అమితవిక్రముడు, ఉదధిక్రమణుడు, సీతాశోక వినాశకరుడు, లక్ష్మణప్రాణదాత, దశగ్రీవదర్పఘ్నుడు" అనునవి ద్వాదశ నామములు. ఇవి జపమాలచే జపింపదగినవి.

శ్లో॥ శ్రీశబ్దా ద్ధనుమచ్ఛబ్దో జయశబ్ద స్తతఃపరం
జయద్వయా దథ శ్చోర్ధ్వం హనుమన్నామ తత్వతః ॥

తా॥ 'శ్రీ' శబ్దము పిదప 'హనుమన్' అనియు, 'జయ' శబ్దము పిదప 'హనుమన్' అనియు, పిదప 'జయజయ' అని రెండుమార్లు పల్కి మరల 'హనుమన్' అని పలుక వలెను

శ్లో॥ షోడశాక్షర మంత్రోయం జప్తవ్యో నిజమాలయా
సాధారణజపే మాఽస్తు న్యాస ధ్యానాశ్చ ముద్రికాః॥

తా॥ ఇది షోడశాక్షర మంత్రము. అను పదములు కల దీనిని తన మాలతో జపించవలెను. సాధారణ జపమున న్యాస, ధ్యాన, ముద్రికల ఆవశ్యకతలేదు.

శ్లో॥ ఆదౌ శ్రీశబ్ద ముచ్చార్య తతో హనుమతేః పదం
నమశ్శబ్దం తతోచ్చార్య అయం సప్తాక్షరీ మనుః
ఏవం సప్తాక్షరీం విద్ధి యయా జప్యా జపమాలయా ॥

తా॥ మొదట 'శ్రీ' శబ్దమునుచ్చరించి పిదప 'హనుమతే' అను పదము పల్కి ఆపైన 'నమః' శబ్దము నుచ్చరించవలెను. ఇది సప్తాక్షరీ మంత్రము. జపమాలచే జపించదగిన సప్తాక్షరీ మంత్రము నిట్లు తెలిసికొనుము. (ఈ యంశము కొన్ని ప్రతులయందు కానవచ్చుట లేదు)

శ్లో॥ అన్యం విశేషం వక్ష్యామి మైత్రేయ! మునిసత్తమ!
యస్య శ్రవణమాత్రేణ జపసిద్ధి ర్భవే న్నృణామ్ ॥

తా॥ ఓ ముని శ్రేష్ఠా! మైత్రేయా! వినినంత మాత్రముననే జనులకు జపసిద్ధి కల్గు వేరొక్క విశేషమును చెప్పుచున్నాను.

శ్లో॥ బ్రహ్మ క్షత్రియ విట్ఛూద్ర చాతుర్వర్ణ్య ముదాహృతం
బ్రాహ్మణై ర్జపసిద్ధ్యర్థం సర్వా ధార్యాఽపి మాలికాః॥

తా॥ బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు అని నాలుగు వర్ణములు చెప్పబడినవి బ్రాహ్మణులకు జపసిద్ధికై అన్ని మాలికలు వినియోగింపదగినవి. ఇచ్చట చివరి పాదమున 'యోగ్యారుద్రాక్షమాలికా' అని పాఠాంతరమున్నది. ఆ పక్షమున బ్రాహ్మణుని జపసిద్ధికై రుద్రాక్షమాలిక యోగ్యమని తెలియనగును.

శ్లో॥ క్షత్రియస్య విశేషేణ జప్యా పద్మాక్షమాలికా
అథవా మౌక్తికీ మాలా సర్వసిద్ధి ప్రదాయినీ ॥

తా॥ క్షత్రియునకు విశేషించి తామరపూసల మాలిక జపించుటకు తగియున్నది. మఱియు ముత్యముల మాలికతో జపించుట క్షత్రియునకు సర్వసిద్ధిప్రదము.

శ్లో॥ విద్రుమై ర్హేమబీజైశ్చ గ్రథితా జపమాలికా
మంత్రసిద్ధికరీ సద్యః వైశ్యానాం మంత్రవేదినామ్ ॥

తా॥ పగడములతో కాని, బంగరు పూసలతో కాని కూర్చబడిన జపమాలిక మంత్రవేత్తలగు వైశ్యులకు మంత్రసిద్ధిని వెంటనే కల్గించును.

శ్లో॥ శూద్రాణాం నాధికారోఽస్తి మంత్రే వా జపకర్మణి
కిన్తు బ్రాహ్మణ సేవైవ నిరపాయగతి ప్రదా ॥

తా॥ మంత్ర విషయమునను, జపకర్మ యందును శూద్రుల కధికారములేదు. కాని గురుతుల్యుడు ఉత్తముడు నగు బ్రహ్మవేత్తయగు బ్రాహ్మణుని సేవయే నిరపాయకర మగు సద్గతినిచ్చును.

శ్లో॥ అపరోఽయం విశేషోఽస్తి మైత్రేయ శృణు తత్వతః
శ్రద్ధాహీనాయ సోఽవాచ్యో గోపనీయం సదా త్వయా॥

తా॥ ఇంకను వేరొక విశేషవిషయమున్నది. మైత్రేయా! శ్రద్ధగా వినుము. దానిని శ్రద్ధలేనివారికి చెప్పరాదు. ఎప్పుడు దానిని నీవు రహస్యముగా నుంచదగును.

శ్లో॥ మూలమంత్ర జపాంతే తు ప్రత్యహం మంత్రవిత్తమః
తామ్రపాత్రే జలం న్యస్య విధాయ కరసంపుటమ్ ॥

తా॥ మూలమంత్రమును జపించిన పిదప మంత్ర విదు డగువాడు ప్రతిరోజు రాగి పాత్రయందు జలమునుంచి చేతిని సంపుట మొనర్చి-

శ్లో॥ ద్వాదశావృత్తిమాత్రం వై మూలమంత్రం సముచ్చరేత్
తతో జలం పిబే త్సద్యః మూలమంత్రేణ సంస్కృతమ్ ॥

తా॥ పండ్రెండు పర్యాయములు మాత్రము మూల మంత్రము జపింపవలెను. పిదప వెంటనే ఆ మూలమంత్ర ముతో సంస్కరింపబడిన నీటిని త్రాగవలెను.

శ్లో॥ ధ్యాయన్నేవాంజనీ సూనోః పాదాబ్జ యుగళం హృది.
ఏవం యః కురుతే యోగీ మంత్రారాధన తత్పరః ॥

తా॥ అంజనీనందనుని పాదపద్మములను హృదయమున ధ్యానించుచునే ఇట్లు ఏ యోగియగువాడు మంత్రారాధన తత్పరుడై చేయునో-

శ్లో॥ మంత్రసిద్ధి ర్భవే త్తస్య మంత్రపూతం వపు ర్భవేత్
సిధ్యన్తి సర్వకార్యాణి దీర్ఘ మాయు శ్చ విందతి ॥

తా॥ వానికి మంత్రసిద్ధియగును. వాని దేహము మంత్రముచే పవిత్రమగును ఆతని సర్వకార్యములు సిద్ధించును. దీర్ఘాయుర్దాయము కల్గును.

శ్లో॥ నాస్తి దుస్వప్నలేశోఽపి నాత్ర కార్యా విచారణా ॥

తా॥ వానికి దుస్వప్నమే కొద్దియు నుండదు. ఇందు ఆలోచింపవలసిన పని లేదు.

శ్లో॥ ఉత్తమం స్వర్ణరౌప్యాభ్యాం మధ్యమం తామ్రపాత్రతః
అధమం పర్ణపాత్రేణ నీచం తు కరసంపుటైః ॥

తా॥ బంగరు పాత్రతోకాని, వెండి పాత్రతోకాని తీర్థము పై రీతిని స్వీకరించుట ఉత్తమము. రాగి పాత్రతో స్వీకరించుట మధ్యమము. ఆకుతో స్వీకరించుట అధమము. కేవల కరసంపుటముతో మంత్రించి తీర్థము స్వీకరించుట నీచము.

శ్లో॥ యేన కేనాపి పాత్రేణ మంత్రపూతం ప్రయత్నతః
పిబే దవ్యాకుల స్వాన్తః మాంత్రికో మంత్రసిద్ధయే॥

తా॥ మంత్రసిద్ధికొఱకై మాంత్రికుడగువాడు ఏదో ఒక పాత్రతో ప్రయత్నపూర్వకముగా మంత్రముచే పవిత్ర మొనర్చబడిన జలమును నిర్మలమగు మనస్సు కలిగి త్రాగవలెను.

శ్లో॥ కదాచి దపి నాలస్యం కర్తవ్యం మంత్రవిత్తమైః ॥

తా॥ మంత్రవిత్తములగు వా రెప్పుడును ఆలస్యము చేయరాదు

శ్లో॥ స్వేష్టమంత్ర జపస్యార్హాం భూమిం సంప్రోక్ష్య వారిణా
యథోక్తవిష్ట రాసీనః యథావిధి జపే న్మనుమ్ ॥

తా॥ తన యిష్టమగు మంత్రమునకు తగిన భూమిని చూచుకొని, నీటితో సంప్రోక్షణ చేసి, శాస్త్రోక్తమగు ఆసనముపై కూర్చుండి యథావిధిగా మంత్రమును జపింపవలెను.

శ్లో॥ జప స్యానంతరం సద్యః సముద్ధృత్య జపాసనం
సంప్రోక్షేత పునర్ధీమాన్ ,జలేన జపభూమికామ్॥

తా॥ జపమయినపిదప వెంటనే జపాసనమును ఎత్తి మరల ధీమంతుడగు మంత్రవేత్త జపభూమిని జలముతో తడుపవలెను.

శ్లో॥ ఏవం స్వాభీష్ట దేవస్య నమస్కారాది సత్క్రియాః
ఆదా వన్తే చ సంప్రోక్ష్య కర్తవ్యా శ్శుద్ధభూమిషు ॥

తా॥ ఈ రీతిగా తన అభీష్ట దైవమునకు సంబంధించి నమస్కారాది సత్క్రియలన్నియు ఆరంభమునను, పూర్తి యయిన పిదప ప్రోక్షణ మొనర్చి, పరిశుద్ధ భూమియందే యొనర్చవలెను

శ్లో॥ ప్రమదా దథవా మోహా దాలస్యా ద్వా విమూఢధీః
న ప్రోక్షేత జపస్థానం తత్ఫలం నైవ విందతి ॥

తా॥ విచక్షణారహితుడగువాడు పొరపాటునకాని, అజ్ఞానము చేకాని, ఆలస్య వశమునకాని జపస్థానమును శుద్ధి చేయకున్నచో జపఫలము పొందలేడు.

శ్లో॥ అనాచా రాతిసంతుష్టాః పిశాచా స్సతతానుగాః
అప్రోక్షిత స్థలే స్థిత్వా బలా ద్గృహ్ణంతితత్ఫలమ్ ॥

తా॥ అనాచారమువలన మిక్కిలి సంతోషించు నట్టియు, కర్మను ఆచరించువారి నెల్లవేళల అనుసరించి యుండునట్టి పిశాచాదులు ప్రోక్షణ చేయనటువంటి స్థలమందుండి జపఫలమును బలవంతముగా సంగ్రహించును.

శ్లో॥ తస్మా త్సర్వప్రయత్నేన జాపకోఽనన్యమానసః
యథాశక్తి జపం కృత్వా ప్రోక్షేత జపభూమికామ్ ॥

తా॥ కావున జపించువాడు ఇతరములందు మనస్సునుంచక యథాశక్తిగా జపముచేసి అనంతరము ప్రయత్న పూర్వకముగా జపభూమిని ప్రోక్షణ చేయవలెను.

శ్లో॥ హానుమ త్పూజనవిధా సత్కర్మ జపకర్మణోః
చంచలం హి మనో బ్రహ్మన్ విషయా అపి వంచకాః॥

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా! మైత్రేయా! హనుమత్పూజా విధానముననుసత్కర్మ ఏది చేయుచున్నను, జపమొనర్చుచున్నను మనస్సేమో చంచలమై యుండును. విషయ సుఖాదు లన్నియు మోసకారులై ఆకర్షించుచుండును.

శ్లో॥ ఇంద్రియాణ్యపి ధావన్తి దుష్టాశ్వా ఇవ వేగతః
తతో నిరుద్ధకిరణః స్వవశీకృత మానసః ॥

తా॥ ఇంద్రియములు దుష్టములగు అశ్వములవలె వేగముగ పరుగిడుచుండును. కావున మనస్సు, వాక్కు, కాయము అను కరణత్రయమును నిరోధించి, మనస్సును శవమొనర్చుకొని–

శ్లో॥ యథాకాలం యథాశక్తి సత్కర్మైవ సమాచరేత్
శ్రేయాంసి బహు విఘ్నానీ త్యముం న్యాయ మనుస్మరన్
సద్యోఽల్ప మపి కుర్వీత ధర్మం యావ ద్దృఢాంగకః ॥

తా॥ కాలానుగుణ్యముగా శక్త్యనుసారము సత్కర్మనే ఆచరింపవలెను. శ్రేయస్కరమగు పనికే విఘ్నము లనేకములు అడ్డమగునను నీతిని స్మరించుచు దేహము దృఢముగనున్నంతలోనే తొందరగా అల్పమాత్రమయినను ధర్మమాచరింపవలెను.

శ్లో॥ పశ్చాత్కర్తవ్యతాబుద్ధిం యః కరోత్యలసో జనః
ఆత్మహా తు స చ ప్రోక్తః స తు సత్కర్మ వంచకః ॥

తా॥ శక్తి సళించిన తరువాత ఏ అలస స్వభావుడు కర్తవ్యము గూర్చి ఆలోచించునో వాడు ఆత్మ ఘాతకుడు గాను, సత్కర్మవంచకుడు గాను చెప్పబడును.

శ్లో॥ యథా ద్రవ్యం యథా కాలం యథాశక్తి శరీరిభిః
విహాయ జడతాం నిత్యం కర్తవ్యో ధర్మసంగ్రహః ॥

తా॥ ఉన్నంత సంపదలోనే, ఉన్నంత సమయము లోనే యథాశక్తిగా మనుష్యులు జడ స్వభావము వీడి ధర్మ సమాచరణ మొనర్చవలెను.

శ్లో॥ మైత్రేయ! జపతాం నిత్యం మంత్ర మేకం హనూమతః
సప్తకోటి మహామంత్రాః సిద్ధ్యన్త్యేవ న సంశయః ॥

తా॥ ఓ మైత్రేయా! ఒక్క హనుమంతుని మంత్రము ను నిత్యము జపించువారికి నిస్సందేహముగా ఏడుకోట్ల మహామంత్రములన్నియు సిద్ధించును.

శ్లో॥ ఆరాధితే కపి శ్రేష్ఠే సమస్తా అపి దేవతాః
భవంతి సతతం తుష్టాః సర్వదేవాత్మకో హి సః ॥

తా॥ ఒక్క హనుమంతుని ఆరాధించుటవలన సమస్త దేవతలు ఎల్లప్పుడు సంతోషింతురు. ఏలనన హనుమంతుడు సర్వ దేవాత్మకుడు కదా!

శ్లో॥ యేన కేనా ప్యుపాయేన హనుమత్పూజనై ర్బుధః
ఉవసం సఫలం కుర్యాత్ స్తోత్రై ర్వా వందనై రపి ॥

తా॥ స్తోత్రముల వలన కాని, నమస్కారముల వలన

కాని ఏదో ఒక రీతిగా హనుమత్పూజ వలన సజ్జనుడగు వాడు దినమును సఫలము చేసికొనవలెను.

శ్లో॥ పాయసం ఘృతసంపూర్ణం మందవారేషు పంచసు
మర్కటాయార్పయేద్ధీమాన్ హనుమాం స్తేన తుష్యతి॥

తా॥ మంచి నేతితో నిండిన పాయసాన్నమును ఐదు శనివారములు బుద్ధిమంతుడగు భక్తుడు మర్కటమూర్తియగు హనుమంతునకు సమర్పింపవలెను. అందుచే హనుమంతుడు తుష్టుడగును.

శ్లో॥ వాలముద్రాం ప్రకుర్వీత జపాదౌ మంత్రవిత్తమః
జపాంతేఽపి తథా దార్ఢ్యా కుర్యాద్యో ప్రణవం యథా॥

తా॥ మంత్రవేత్తయగువాడు జపాదియందు వాలముద్రాప్రదర్శన మొనర్చవలెను. వేదమునకు ఆదియందు నంతమునందు ఓంకార మున్చరించినట్లు జపాంతమునందును వాలముద్ర ప్రదర్శింపవలెను.

శ్లో॥ వామహస్తం హృది న్యస్య శిర స్యాధాయ దక్షిణం
పురోలక్ష్యాంగుళితలం వాలముద్రా ప్రకీర్తితా ॥

తా॥ ఎడమచేతిని హృదయమునందుంచి అంగుళి తలము ముందుకు చూచునట్లు దక్షిణ హస్తమును శిరస్సున నుంచిన వాలముద్ర యనబడును.

శ్లో॥ వాలముద్రా ప్రభావేన జప స్సంపూర్ణతాం వ్రజేత్
హనుమా నపి సంతుష్టో మంత్రరా జాధిదైవతః ॥

తా॥ వాలముద్రా ప్రభావము వలన జపము సంపూర్ణత నందును. మంత్రరాజమున కధిదేవతయగు హనుమంతుడును సంతోషించును.

శ్లో॥ యత్కర్మ విహితం నిత్యం కామ్యం నైమిత్తికం తు హి
ప్రాతఃకాలే కృతం స్యాచ్చే త్తదుత్తమఫలప్రదమ్॥

తా॥ కోరికను దేనినయిన పెట్టుకొని చేయు కామ్యకర్మకాని, వేరునిమిత్తము కల నైమిత్తిక కర్మకాని, ప్రతినిత్యము ఏది విధింపబడునో అదియు ప్రాతఃకాలమున చేసిన యెడల ఉత్తమ ఫలితము నిచ్చును.

శ్లో॥ దైవాత్ప్రమాదా దాలస్యా ద్యది కర్మాతిలంఘనం
నిత్యాదీ న్యపి కర్మాణి న యథోక్తఫలాని వై ॥

తా॥ దైవికముగాకాని, ప్రమాదవశమునకాని, ఆలస్యమువలనకాని కర్మను దాటవేసినచో నిత్యనైమిత్తికాది కర్మలేవియు వాటికి చెప్పబడిన ఫలితము లీయవు.

శ్లో॥ జన్తు ర్బద్ధోఽపి సంసారే సుఖ దుఃఖ మయే సదా
నిర్లిప్త ఇవ వర్తేత పద్మపత్ర మివాంభసా ॥

తా॥ సుఖదుఃఖమయమగు సంసారమునందు మనుజుడెప్పుడూ బంధింపబడియున్నను తామరాకుపై నీటిబొట్టు కల్గియున్నట్లు నిర్లిప్తతతో ప్రవర్తింపవలెను.

శ్లో॥ స్వాభీష్టదేవతాసక్త హృదయ శ్శుద్ధమానసః
కులాలకీలువ న్నిత్యం నయే త్కాల మతంద్రితః ॥

తా॥ తన ఇష్టదేవతనే హృదయమున నుంచుకొని పరిశుద్ధమగు మనస్సు కల్గి ఎల్లప్పుడు కుమ్మరిపురుగువలె త్రోట్రుపాటు లేక కాలము గడుపవలెను.

శ్లో॥ ఇత్థం కరోతి యో నిత్యం తస్య మృత్యుర్న విద్యతే

ఇట్లు ప్రతినిత్య మెవ్వడు చేయునో ఆతనికి మృత్యు భయములేదు.

శ్లో॥ ప్రాప్నుయా న్మతిమా న్జంతుః కర్మాధీనం జగ ద్యతః
కర్మాణ్యపి సదా కుర్వ న్విహితాని సమాచరేత్ ॥

తా॥ జగత్తంతయు కర్మాధీనమైనది కనుక బుద్ధిమంతు డగు మనుజుడును కర్మను పొందును. అట్టి కర్మల నెల్ల ప్పుడు ఆచరించుచునే విహితములగు వానిని నెరవేర్చవలెను.

శ్లో॥ ఆచర న్విహితా న్జంతుః మనః పూతం సమాచరేత్
సాకల్యేన న శక్యం తే కర్తుం కర్మాణి జంతుభిః॥

తా॥ మనుష్యుడు విహితకర్మల నాచరించుచు మన స్సును పవిత్ర మొనర్చుకొనవలెను. జనులకు అన్ని కర్మలను నెరవేర్చుట సాధ్యము కాదు.

శ్లో॥ సమస్తకర్మభి శ్చైకం మనః పూతం సమాచరేత్
ఆయాస బహుళం కర్మ న కదాపి సమాచరేత్ ॥

తా॥ సమస్తములగు కర్మలచేతను మనస్సును పవి త్రము గావించుకొనవలెను. ప్రయాసతో కూడుకొనిన కర్మ నెప్పుడును ఆచరింపరాదు.

శ్లో॥ చిత్తశుద్ధి వినా భూతం నిష్ఫలం భవతి ధృవం
భక్తి శ్రద్ధా విశుద్ధాత్మా చింతయే ద్దేవతాం సదా ॥

తా॥ చిత్తశుద్ధిలేని కర్మ నిశ్చయముగా నిష్ఫలమగును. భక్తిశ్రద్ధలు కల్గి స్వచ్ఛమగు మనస్సు కలిగి భక్తుడు ఎల్లప్పుడు దైవమును ధ్యానించవలెను.

శ్లో॥ నిత్యం నైమిత్తికం వాపి సదా కర్మ సమాచరేత్
అహంకారం చ దంభం చ విహాయ ఫలకామనాం
నిత్యం య త్క్రియతే కర్మ హనుమాం స్తేన తుష్యతి॥

తా॥ నిత్యముకాని, నైమిత్తికముకాని యేదైనను ఎల్లప్పుడు మనుష్యుడు కర్మ నాచరింపవలెను. అహంకారమును, మోసమును, ఫలితముపై కోరికను విడిచి నిత్యము చేయు కర్మ వలన హనుమంతుడు సంతోషించును.

శ్లో॥ అన్నాదికం నిజాభీష్ట దేవతాయై సమర్పితం
ప్రోక్షితం చాఽపి గాయత్ర్యా భక్షయే ద్భక్త శేఖరః॥

తా॥ అన్నము మున్నగు పదార్థములను గాయత్రి మంత్రము చెప్పుచు ప్రోక్షణ మొనర్చి తన ఇష్టదైవమునకు నివేదన మొనర్చి భక్తశేఖరుడగు వాడు పిదప దానిని భుజించవలెను.

శ్లో॥ కదాచి దపి నైవేద్యం నోపేక్షేతాఽపి సంకటే
ఉచ్ఛిష్ట స్పృష్టదోషే వా న త్యజే దపి కించన ॥

తా॥ ఎట్టి కష్టములు వచ్చినను ఎప్పుడును దేవునికి

నివేదించిన పదార్థము వదలిపెట్టరాదు. తినగా మిగిలిన ఉచ్ఛిష్టదోషమున కాని, ఎవ్వరో తాకుట వలన యేర్పడు దోషమున కాని ప్రసాదమును విడిచి పెట్టరాదు.

శ్లో॥ ప్రమాదా దపి గర్వా ద్వా తృప్త్యా శ్చారుచిభావనాత్
నివేదితాన్న రేణుం చ పాత్రమధ్యే న శేషయేత్ ॥

తా॥ ప్రమాదవశమునకాని, గర్వమునకాని, కడుపు నిండుటచే తృప్తి వలనకాని, రుచిగా లేదను భావమునకాని దైవనివేదితమగు అన్నమున ఒక రేణువంతయినను పాత్ర మధ్యమున మిగల్చరాదు.

శ్లో॥ ఉల్లంఘనా త్ప్రసాదస్య భక్తి పూజా వృధా భవేత్
జాజ్వల్యమాన జిహ్వాగ్రే నీహార ఇవ పావకే ॥

తా॥ ప్రసాదమును వీడుటవలన భక్తియు, పూజయు, మిక్కిలి మండెడు శిఖలుకల అగ్నియందు మంచుబిందువు వేసిన యెట్లు వ్యర్థమై కనుపించకుండ పోవునో అట్లు వ్యర్థమగును.

శ్లో॥ ప్రసాదే నియమ స్సాధుః న శ్రేయో నియమం వినా

తా॥ ప్రసాదవిషయమున నియమము పాటించుట మంచిది. నియమము లేకున్న శ్రేయస్సు కలుగదు.

శ్లో॥ యో వా బిభ ర్త్యనంతాని నామాని వివిధా న్యపి
యస్యావతారా బహవో మత్స్య కూర్మాది రూపిణః
సర్వత్ర సమతా బుద్ధ్యా జగ ద్రక్షతి సర్వదా ॥

తా॥ ఎవ్వరైతే వివిధములైన అనంతములగు నామ

ములు వహించుచున్నారో, ఎవరి అవతారములు మత్స్య కూర్మాది రూపము లనేకములుగా కలవో, ఎల్లప్పుడు జగత్తంతట సమబుద్ధితో చూచుచున్నాడో-

శ్లో॥ చేష్టా శ్చ వివిధా యస్య భక్తానుగ్రహ హేతవః
తత్త ద్భక్తానుకూలాని రూపా ణ్యంగీకరోతి యః
పునాతి సకలా న్లోకాన్ చరిత్రైః పరమాద్భుతైః ॥

తా॥ ఎవరికైతే భక్తుల ననుగ్రహించుటకు హేతువు లగు వివిధములైన చేష్టలు కలవో, ఎవరైతే ఆయా భక్తుల కనుకూలములగు రూపములను ధరించుట కంగీకరించు చున్నారో, ఎవరైతే పరమాద్భుతములైన తన చరిత్రల ద్వారా సకల లోకములను పవిత్రము చేయుచున్నారో,

శ్లో॥ సమ స్తోపనిష ద్వాచ్యో యత్ర సిద్ధాంత మాశ్రితః
సృజ త్యఖిలజంతూ న్యః సృష్టౌ బ్రహ్మస్వరూపధృత్ ॥

తా॥ తత్వ సిద్ధాంతము లాశ్రయించి యున్న సమస్త ములగు ఉపనిషత్తులచేత ఎవరు చెప్పబడుచున్నారో, సృష్టి విషయమై బ్రహ్మస్వరూపము ధరించి సర్వప్రాణుల నెవరు సృష్టి చేయుచున్నారో-

శ్లో॥ సృష్ట్వా చాఖిలజంతూ న్యః ప్రతిష్ఠాపయతి ప్రభుః
విలాపయ త్యేవ జన్తూన్ తత్త త్కర్మానుసారతః
స ఏవ హనుమాన్ జ్ఞేయః సర్వభూతమయ శ్శుచిః ॥

తా॥ సమస్త ప్రాణులను సృష్టిచేసి సమర్థుడై ఎవరు

అన్నిటిని నిల్పుచున్నాడో, ఆయా ప్రాణులను వానివాని కర్మల ననుసరించి ఎవరు నడిపించుచున్నారో ఆతడే సర్వ ప్రాణిమయుడు, పరిశుద్ధుడు, అందరిచేత తెలియదగినవాడు అయిన హనుమంతుడు.

శ్రీ పరాశరస్తుతిః—

శ్లో॥ త మేవ జానీహి జగద్గురుం మునే!
త మేవ సర్వక్రతు భోక్తృరూపిణం
త మేవ సర్వక్రతు సిద్ధిదాయకం
త మేవ సర్వక్రతు హవ్యరూపిణమ్ ॥

తా॥ ఓ మైత్రేయ మహామునీ! ఆ హనుమంతునే జగద్గురువుగా నెరుగుము. ఆతనినే సర్వక్రతువులకు భోక్తగా నెరుంగుము. వానినే సర్వక్రతువుల సిద్ధిని ప్రసాదించు వానినిగా నెరుగుము. ఆ మహానీయునే సమస్త క్రతువుల హవ్య రూపునిగా నెరుంగుము.

శ్లో॥ సమస్త శబ్ద ప్రతిపాద్యమూర్తిః
సమస్త కల్యాణ గుణాభిరామః
సమస్త జీవా ననిశం బిభర్తి
సూత్రం యథా హారమణీన్ హనూమన్ ॥

తా॥ సమస్త శబ్దములచేతను ప్రతిపాదింపబడు మూర్తి ఆతడే. సమస్త శుభప్రదములగు గుణములతోను

ప్రకాశించువా డాతడే. ఆ హనుమంతుడే హారిమందలి మణుల నన్నిటిని దారము వహించినట్లు సమస్త ప్రాణికోటిని వహించుచున్నాడు.

శ్లో॥ స ఏక ఏవాఖిల విశ్వరూపధృత్
స్వర్ణం యథా కంకణ కుండలాత్మధృత్
అనాద్యవిద్యావశరూప నామని
తత్రైకవస్తు న్యపి కల్పితే ఉభే ॥

తా॥ బంగారము ఏ రీతిగా కంకణముగాను కుండలము గాను తానే రూపము దాల్చునో అట్లే అఖిల విశ్వము యొక్క రూపము ధరించిన మూర్తి ఆతడొక్కడే. అనాదియైన, అవిద్యామూలకమగు రూపము, నామముకల ఒక్క వస్తువునందే జీవదేవభావములు రెండు కల్పింపబడుచున్నవి.

శ్లో॥ ద్వయం హనూమ త్యపి కల్పితం మృషా
నామాని రూపం వ్యవహారసిద్ధయే
మాయావశా దాత్మని సచ్చిదాత్మని
ప్రబుధ్యతే య స్తు తర త్యయం జనః ॥

తా॥ సత్, చిత్, ఆనందరూపమగు ఆత్మరూపుడగు హనుమంతునియందు మాయావశమున వ్యవహారసిద్ధికై కల్పితములగుచున్న నామములు, రూపము అను రెండును అసత్యమే. ఈ సత్య మెరిగి ఎవడు మేల్కొంచునో అట్టి మనుష్యుడు ముక్తి నందును.

శ్లో॥ చరాచర మిదం విశ్వం సర్వం హనుమదాత్మకం
ఏవం విభావయ న్త్యేనం తే తరన్తి న సంశయః ॥

తా॥ చరాచరమగు ఈ విశ్వమంతయు హనుమద్రూపమైనది. ఎవరైతే శ్రీ హనుమంతు నిట్లు భావింతురో వారు నిస్సంశయముగా తరింతురు.

శ్లో॥ ఏవం భావయితుం యే వై న సమర్థాః పృథగ్జనాః
ఉదీర్యంతా మితి స్వచ్ఛం త ద్విశ్వం హనుమన్మయమ్॥

తా॥ ఇట్లు భావించుటలో ఏ జనులు అసమర్థులో అట్టివారు స్వచ్ఛముగా జగత్తంతయు హనుమన్మయమని పలుకవలెను.

శ్లో॥ అత్రైవోదాహర న్తీమం ఇతిహాసం పురాతనం
యస్య శ్రవణమాత్రేణ పరాం ప్రీతి మవాప్స్యసి ॥

తా॥ ఈ విషయమునందే పురాతనమగు ఈ ఇతిహాసము చెప్పుచుందురు. దీనిని వినుటవలన నీవు మిక్కిలి ఆనందించగలవు.

శ్లో॥ పురా పురందర శ్శ్రీమాన్ వృత్రాసుర వధోద్యతః
తన్మాయామోహిత స్వాంతో నైవాత్మా సముబుధ్యత॥

తా॥ పూర్వము వృత్రాసురుని చంపెడి ప్రయత్నమున నున్న శ్రీమంతుడగు దేవేంద్రుడు ఆ రాక్షసుని మాయచే మైకము కమ్మినవాడై చైతన్యము కోల్పోయెను.

శ్లో॥ పపాత సహసా వజ్రం స్తంభీభూ తేంద్రపాణితః
తతో గురు స్సమాగత్య బృహస్పతి రుదారధీః ॥

తా॥ మూర్ఛనందుటచే కొయ్యబారిన ఇంద్రుని చేతినుండి ఒక్కమాటుగా వజ్రాయుధము పడిపోయెను. పిమ్మట ఉదారబుద్ధికల దేవగురువగు బృహస్పతి వచ్చి.

శ్లో॥ ఇదం హనూమత స్తోత్రం శక్రా యోపదిదేశహ
గురూపదిష్ట హనుమత్ స్తోత్రరాజం శచీపతిః
ఉత్థాయ మూర్ఛనా చ్ఛక్ర స్సుప్తోత్థిత ఇవ ధృతం
గురూపదిష్ట విధినా తుష్టావ కపినాయకమ్ ॥

తా॥ ఈ క్రింద చెప్పబోవు హనుమత్ స్తోత్రమును దేవేంద్రునకుపదేశించెను. వెంటనే శచీపతియగు దేవేంద్రుడు నిద్రనుండి మేల్కొంచినట్లు మూర్ఛనుండి తేరుకొని లేచి గురువుచే నుపదేశింపబడి తానందిన హనుమత్ స్తోత్ర శ్రేష్ఠమును గురువుఉపదేశించిన విధమున చేయుచు హనుమంతుని రీతిగా స్తోత్ర మొనర్చెను.

ఇంద్రకృతస్తుతిః—

శ్లో॥ నమామి జగతాం నాథం జగ దారాధ్య వైభవం
సృష్టి స్థితి లయానాం చ హేతు మీశ్వర మవ్యయమ్॥

తా॥ లోకములన్నిటికి ప్రభువైనట్టి, జగత్తుచే ఆరాధింపదగు వైభవము కల్గినట్టి, సృష్టి, స్థితి, లయములకు కారణమైనట్టి, సర్వ సమర్థుడైనట్టి, నాశరహితుడైనట్టి హనుమంతుని నమస్కరించుచున్నాను.

శ్లో॥ పార్వతీగర్భసంభూతం సచ్చిదానంద విగ్రహం

తా॥ పార్వతీ గర్భ సంభూతుడైనట్టి, సచ్చిదానంద మూర్తియైనట్టి హనుమంతుని నమస్కరించుచున్నాను.

శ్లో॥ యస్య కుక్షౌ సమావిష్టాః లోకా వై భూర్భువాదయః
నిత్యం హి సుఖితా స్సన్తి తన్నమామి జగద్గురుమ్॥

తా॥ ఎవని గర్భమున భూలోక భువర్లోకాదులు అన్నియునుండి నిత్యము సుఖమందుచున్నవో, అట్టి జగద్గురువైన హనుమంతుని నమస్కరించుచున్నాను.

శ్లో॥ యస్య ప్రసాదా న్మర్త్యో వై మృత్యుం జయతి మానవః
తమేవాహం నమస్కుర్యాం జరా మరణ వర్జితమ్ ॥

తా॥ ఎవని యనుగ్రహమువలన మృతికల వాడయ్యు మనుష్యుడు మృత్యువును జయించుచున్నాడో, అట్టి జరామరణములు లేని హనుమంతుని నమస్కరించుచున్నాను.

శ్లో॥ హనుమన్మూర్తయే తస్మై నరనారాయణాత్మనే
అంజనాగర్భ సంభూత్యై రక్షసాం వధ హేతవే
పంపాతీర నివాసాయ మారుత్యై చ నమోనమః ॥

తా॥ నరనారాయణాత్మకుడైనట్టి, అంజనా గర్భమున జనించినట్టి, రాక్షసుల వధకు కారకుడైనట్టి, పంపాతీర వాసియైనట్టి, వాయునందనుడైనట్టి హనుమన్మూర్తికి నమస్కారము.

శ్లో॥ కపివరేశ్వరం కామితార్థదం
త్రిపుర హాత్మజం దీన పోషకం
విపుల వక్షసం విమల చేతసం
కామితార్థదం కమల లోచనమ్ ॥

తా॥ వానర వీరుల కధిపతిని, కోరిన కోర్కెల నిచ్చు వానిని శంకరపుత్రుని, దీనపోషకుని, విశాలమగు వక్షస్థలము కలవానిని, నిర్మలమగు మనస్సు కలవానిని, కమల నేత్రములు కలవానిని,

శ్లో॥ పవన నందనం పావక ప్రభం
భవ విదారణం భాగ్య కారణం
ప్లవగ నాయకై ర్భావి తోద్యమం
నవ కవిత్వ వాఙ్నాయకం భజే ॥

తా॥ వాయుకుమారుని, అగ్నివంటి తేజస్సు కల వానిని, జనన బంధమును తొలగించునట్టివానిని, సంపదలకు కారణుడైన వానిని, కపినాయకులచే ప్రయత్నము చేయించినట్టి, నవకవిత్వ వాక్కునకు నాయకుడైనట్టి హనుమంతుని సేవింతును.

శ్లో॥ అంజలిగ్రహీ తాత్మదైవతం
మంజుభాషితై ర్మానవోత్తమం
రాజయన్ సదా రామభూపతిం
అంజనా యశఃపుంజ మాశ్రయే ॥

తా॥ తన దైవమగు రామునకు అంజలిఘటించి మానవోత్తముడగు రామభూపతి నెల్లప్పుడు కమ్మని మాటలతో ఆనందింపజేయుచు నున్నట్టి, అంజనాదేవి కీర్తి సమూహమగు ఆంజనేయుని ఆశ్రయింతును.

శ్లో॥ సుందరానన సూర్య తేజసం
నందినాథవ న్నందితాఖిలం
మందరాద్రివ ద్భంధురాకృతిం
వందితం భజే వానరోత్తమైః॥

తా॥ సుందరమగు ముఖము కలవానిని, సూర్యుని వంటి తేజస్సు కలవానిని, శివునివలె అందరిచే నమస్కరింప బడువానిని, మందరపర్వతమువలె ఒప్పెడి ఆకారము కల్గిన వానిని, వానరశ్రేష్ఠులచే నమస్కరింపబడువానిని హనుమంతుని సేవింతును.

శ్లో॥ కనక కుండలం ఘనత రాంగకం
దనుజ నాశనం ధర్మవిగ్రహం
జనకకన్యకాచరిత మంగళం
మనుమహాంజనా మానితాత్మజం॥

తా॥ బంగారుకుండలములు కలవానిని, గొప్ప అవయవములు కలవానిని, రాక్షసులను నాశనమొనర్చినవానిని, ధర్మస్వరూపుడైనవానిని, జానకీదేవికి మేలుకూర్చినవానిని, అంజనాదేవియొక్క కుమారుని హనుమంతుని సేవింతును.

శ్లో॥ శ్రుతి రసాయనం స్తుతి పరాయణం
అతుల విక్రమం ఆర్త తారణం
కృత జగద్ధితం కేసరి ప్రియం
మతిమతాం వరం మానదం భజే॥

తా॥ వినుటకు మధురమైనవాడును, ఎల్లప్పుడు స్తుతి

చేయుచుండువాడును, సాటిలేని పరాక్రమము కలవాడును, దీనులను రక్షించువాడును, లోకమునకు హితము చేయువాడును, కేసరికి ఇష్టుడును, బుద్ధిమంతులలో శ్రేష్ఠుడును, గౌరవము కల్గించువాడును అగు శ్రీ హనుమంతుని సేవింతును.

శ్లో॥ నిబిడ ముష్టినా నిహత రావణం
ప్రబల భావనా భావి పద్మజం
కబళి తారుణం గాన లోలుపం
విబుధ తోషకం వీర మాశ్రయే॥

తా॥ బిగించిన పిడికలితో రావణుని మోదినవాడును, గొప్పభావనతో బ్రహ్మభావన మొనర్చినవాడును, సూర్యుని కబళించినవాడును, గానమునందు మిక్కిలి ఇష్టము కలవాడును, పండితులకు, దేవతలకు సంతోషము కల్గించువాడును వీరుడును అగు హనుమంతు నాశ్రయింతును.

శ్లో॥ పరమపావనం పార్వతీ సుతం
నిరుప మౌజసం నిర్జి తేంద్రియం
ఖర నఖాయుధం కామరూపిణం
సురపతి స్తుతం శూర మాశ్రయే॥

తా॥ పరమపవిత్రుడగువాడును, పార్వతీనందనుడును, సాటిలేని తేజస్సు కలవాడును, ఇంద్రియ నిగ్రహము కలవాడును, వాడియగు గోళ్ళ ఆయుధములు కలవాడును, కోరినరూపము దాల్చగలవాడును, ఈ దేవేంద్రునిచే స్తుతింపబడువాడు శూరుడు నగు హనుమంతు నాశ్రయింతును.

శ్లో॥ గంధమాదన శైలాగ్ర స్వర్ణరంభా వనాశ్రయ!
హనుమ న్రక్ష మాం దీనం సర్వభూత దయాపర!॥

తా॥ గంధమాదనపర్వతముపై నున్న బంగారు అరటి తోటయే ఆశ్రయముగా కలవాడా, సర్వప్రాణులయందు దయకలవాడా, హనుమంతా! దీనుడనగు నన్ను రక్షింపుము.

శ్లో॥ సంసార కుహర ధ్వాంత నితాన్త భ్రాన్త చేతసం
హనుమ న్మా మనాథం త్వం కిమర్థం సముపేక్షసే॥

తా॥ ఓ హనుమంతా! సంసార గుహాయందలి చీకటిలో నెల్లప్పుడు తిరుగాడు మనస్సుకల్గిన, అనాథుని నన్ను నీ వెందుకు ఉపేక్షించుచున్నావు?

శ్లో॥ హనుమ న్మధురాస్వాద కదళీఫల పాణయే
అమోఘ స్వర్ణటంకాయ కర్కటీహారిణే నమః॥

తా॥ తీయనగుఅరటిపండ్లు చేతిలోకలవాడా! అమోఘమగు బంగరు కత్తి కలవాడా! దోస, చెఱకువంటి వానిని గైకొనువాడా! హనుమంతా! నీకు నమస్కారము

శ్లో॥ ఉష్ట్రారూఢ! కపిశ్రేష్ఠ! త్వత్పాద ధ్యాన సంశ్రయం
దుఃఖ సంసార మగ్నం మా ముద్ధరస్వ జగత్పతే!॥

తా॥ ఒంటె వాహనము కలవాడా! వానరశ్రేష్ఠా! జగన్నాయకా! దుఃఖమయమగు సంసారమున మునిగి

యున్నట్టి, నీ పాదధ్యానము నాశ్రయించినట్టి నన్ను ఉద్ధరించుము.

శ్లో॥ రేతో మూత్ర పురీషాఽసృక్ పూయదుర్గంధభూషితం
భగ మేహాన సంయోగం మూఢో వై మన్యతే సుఖమ్॥

తా॥ ఇంద్రియము, మూత్రము, మలము, రక్తము, చీము, దుర్గంధములతో నింద్యమైన యోనిలింగ సంయోగమును సుఖముగా నెంచువాడు మూర్ఖుడేకదా!

శ్లో॥ త్వ త్సేవావిముఖా న్నిత్యం హనుమ న్నత జంతవః
వృథా మూఢధియో జాతా శ్శిశ్నోదర పరాయణాః॥

తా॥ అయ్యో! ని సేవకు విముఖులై యుండుటవలన హనుమంతా! ఈ ప్రాణులు నిత్యము తినుట సుఖమనుభవించుటలతో వ్యర్థముగా మూఢమతు లౌచున్నారుగదా!

శ్లో॥ తృణమపి న చల త్యశేషబంధో!
కపికులనాథ! తవాజ్ఞయా వినా వై
ఇతి జగ దఖిల విధేయభూతం
విదితవతాం న కదాపి దుఃఖలేశః॥

తా॥ సమస్త జనులకు బంధువైనవాడా! వానరవంశ నాయకుడా! నీ ఆజ్ఞ లేనిదే ఆకు కూడ కదలదు అని లోకమంతయు విధేయమై యుండదగిన నిన్ను తెలిసికొనిన వారికి కొద్ది దుఃఖమైన నెన్నడు కలుగదు

శ్లో॥ వందే వాయుతనూభవం సుచరితం వందే జగద్రూపిణం
వందే వజ్రతనుం సురారి దళనం వందే దయాసాగరం

వందే పంచముఖం సుకుండల ధరం వందే కపీనాం పతిం
వందే సూర్యసుతా సఖం ప్రియఫలం వందే హనూమత్ప్రభుమ్

తా॥ వాయునందనునకు నమస్కారము. మంచి చరిత్ర కలవానికి నమస్కారము. జగత్ప్రాణునకు నమస్కారము. వజ్రదేహునకు నమస్కారము. రాక్షసాంతకునకు నమస్కారము. దయాసముద్రునకు నమస్కారము. ఐదుముఖములు కలవానికి నమస్కారము. మంచికుండలములు ధరించువానికి నమస్కారము. వానర నాథునకు నమస్కారము. సూర్యుని కుమార్తెయగు సువర్చలయొక్క ప్రియునకు నమస్కారము. ఇష్టమగు ఫలస్వరూపునకు నమస్కారము. హనుమత్ప్రభువునకు నమస్కారము.

శ్లో॥ ధన్యా వాచః కపివరగుణ స్తోత్రపూతాః కవీనాం
ధన్యో జంతు ర్జగతి హనుమ త్పాదపూజా ప్రవీణః
ధన్యా వాసం సతత హనుమ త్పాదముద్రాభిరామం
ధన్యం లోకే కపికుల మభూ దాంజనేయావతారాత్ ॥

తా॥ వానరప్రముఖుడగు హనుమంతుని స్తోత్రములతో పవిత్రమైన కవులవాక్కులే ధన్యమైన వాక్కులు. జగత్తున హనుమత్పాద పూజయందు ప్రవీణుడగువాడే ధన్యుడు. ఎల్లప్పుడు హనుమత్పాదముద్రలతో ప్రకాశించు చోటే ధన్యమైన చోటు ఆంజనేయు డవతరించిన కారణమున లోకముల వానర వంశమే ధన్యమయ్యెను.

శ్లో॥ ఇతి స్తుత్వా హనూమంతం సహస్రాక్ష శ్శచీపతిః
సంప్రాప్త విక్రమౌదార్యః సుప్తోత్థిత ఇవాభవత్ ॥

తా॥ అని హనుమంతుని స్తుతించి శచీనాధుడు, వేయికండ్లు కలవాడు అగు దేవేంద్రుడు తిరిగి ప్రాప్తించిన గొప్ప పరాక్రమము కలవాడై నిద్రనుండి లేచిన వానివలె నయ్యెను

శ్లో॥ సమాదాయ పున ర్వజ్రం వృత్రాయ వ్యసృజ త్తదా
తతో వజ్రహతో వృత్రః పపాత చ మమార చ ॥

తా॥ అప్పుడు మరల వజ్రాయుధమును స్వీకరించి వృత్రాసురుని పైకి వదలెను. పిమ్మట వజ్రాయుధముచే కొట్టబడిన వృత్రాసురుడు నేలబడి మరణించెను.

శ్లో॥ పఠంతి యే స్తోత్ర మిమం పవిత్రం
జిగీషత స్తే విజయం ప్రహరాంతి
అస్మాక మంతర్ద్విషతా మపేక్షయా
హనూమత స్తోత్రబలా దభూ త్పురా ॥

తా॥ ఎవరైతే పవిత్రమగు ఈ హనుమత్ స్తోత్రమును పఠింతురో శత్రువులను జయింపగోరు నట్టివారు తప్పక విజయమందెదరు. మాఅంత శ్శత్రువులను జయించు కోరికతో కూడ పూర్వము హనుమంతుని స్తోత్రము చేసి స్తోత్రబలముచే విజయమందితిమి.

శ్లో॥ భవా నపి స్వైరచరో హి నూనం
భవిష్యసి ప్రాప్త మహానుభావః

మైత్రేయ తస్మా ద్భవతోపదిశ్యతాం
హనూమత స్తోత్ర మిదం యథార్థతః ॥

తా॥ ఓ మైత్రేయా! నీవు కూడ నిజముగా సంతతట సంచరించు చుండువాడవు కాన ఈ స్తోత్రము వలన మహాను భవ మందగలవు. కావున అర్థత ననుసరించి ఈ హనుమత్ స్తోత్రమును నీకుపదేశించుచున్నాను.

శ్లో॥ ద్వైతా ఽఽశ్రమేషు విచర న్మునిగీయమానా
న్యత్యద్భుతాని హనుమ చ్చరితాని శృణ్వన్
కల్పా న్బహూ నపి నయామి ముహూర్తమాత్ర
మానందసాగర నిమగ్న నిజాంతరంగః ॥

తా॥ ఓ మైత్రేయా! ద్వైతాశ్రమమున సంచరించు చున్నవాడనై మునిగణముచే గానము చేయబడునట్టి అత్యద్భుతములగు హనుమచ్చరితలను వినుచు ఆనంద సముద్రమున నోలలాడు మనస్సు కల్గి అనేక కల్పముల కాలమును కూడ క్షణములో గడుపు చున్నాను.

ఇతి
శ్రీ పరాశర సంహితాయాం
పరాశర మైత్రేయ సంవాదే
హనుమన్మంత్రవివరణే
జపమాలాలక్షణం నామ
పంచపంచాశ త్పటలః

## షట్పంచాశ త్పటలః

# స్వప్న హనుమన్మంత్ర ప్రభావ వర్ణనం

శ్రీ పరాశరః—

శ్లో॥ అన్య ద్రహస్యం వక్ష్యామి మైత్రేయ శృణు తత్వతః
లోకోపకారం గోప్యం చ శృణ్వాతాం పుణ్యవర్ధనమ్ ॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు. ఓ మైత్రేయా! ఇంకొక విశేషము చెప్పుచున్నాను, శ్రద్ధగా వినవలసినది. అది లోకమునకు ఉపకార మొనర్చునది, రహస్యముగా నుంచదగినది, పుణ్యమును పెంపొందించునది కూడ.

శ్లో॥ స్వప్నాఖ్య హనుమన్మంత్రః చిత్తశుద్ధిప్రదో నృణాం
న దేయో భక్తిహీనానాం కదాచి త్ప్రాణసంకటే॥

తా॥ అది నరులకు చిత్తశుద్ధి కల్గింప జాలిన స్వప్నాఖ్యమగు హనుమన్మంత్రము. దానిని ప్రాణాపాయ మేర్పడినను ఎన్నడూ భక్తిహీనులకు ఉపదేశించరాదు

శ్లో॥ మంత్రోద్ధారం ప్రవక్ష్యామి మంత్రవి న్మంత్రసిద్ధిదం
ఆదౌ ప్రణవ ముచ్చార్య దూరదృష్టిపదం వదేత్ ॥

తా॥ ఓ మంత్రజ్ఞుడా! మంత్రసిద్ధినొసగజాలు ఆ మంత్రమును చెప్పుచున్నాను, వినవలసినది. ముందుగా 'ఓం' కారమునుచ్చరించి 'దూరదృష్టి' పదము నుచ్చరించవలెను.

శ్లో॥ దూరశ్రవణ మి త్యేత దుచ్చరే త్తదనంతరం
సమాగతానాగ తేతి పదం తు సముదాహరేత్ ॥

తా॥ 'దూరశ్రవణ' అను దానిని పిదప నుచ్చరింప వలెను. 'సమాగతానాగత' పదమును కూడ ఆపై పల్క వలెను.

శ్లో॥ వర్తమానే త్యపి పదం ఉచ్చరే దవితంద్రితః
సర్వలోకేతి శబ్దం చ వృత్తాంతే త్యపి సంవదేత్ ॥

తా॥ జాకరూకతతో 'వర్తమాన' పదమును, "సర్వలోక" అను శబ్దమును, 'వృత్తాంత' అనియును పలుక వలెను.

శ్లో॥ తతో విజ్ఞానశబ్దం చ యథాయోగం సముచ్చరేత్
హనుమత్పద ముచ్చార్య మహ్యాం దేహీ త్యుదీరయేత్ ॥

తా॥ పిమ్మట 'విజ్ఞాన' శబ్దమును యథాయోగముగ బలుకవలెను. 'హనుమన్' అను పదము నుచ్చరించి 'మహ్యాందేహీ' అని పలుకవలెను.

శ్లో॥వహ్నిజాయాం సముచ్చార్య క్రమా త్తన్మంత్ర ముద్ధరేత్
చత్వారింశ ద్వర్ణరూపా మంత్రరాజో మహాబలః ॥

తా॥ పిదప 'స్వాహా' అని పల్కి క్రమమున స్వాహాంజనేయ మంత్రోద్ధార మొనర్పవలెను. ఇది నలుబది వర్ణములు కల శక్తివంతమగు మంత్రరాజము.

శ్లో॥ స్వాహాఖ్య హనుమన్మంత్రః సర్వాభీష్ట ఫలప్రదః
అస్య స్వాహాఖ్య మంత్రస్య ఋషి బ్రహ్మా ప్రకీర్తితః॥

తా॥ ఈ స్వప్నాంజనేయ మంత్రము సమస్తములగు కోర్కెలను తీర్చునట్టిది. ఈ మంత్రమునకు బ్రహ్మ ఋషిగా చెప్పబడుచున్నాడు

శ్లో॥ గాయత్రీ ఛంద ఇత్యాహుః హనుమాన్దేవతా భవేత్
ప్రణవం బీజ మి త్యుక్తం స్వాహా శక్తిః ప్రకీర్తితా ॥

తా॥ గాయత్రీ ఛందస్సు; హనుమాన్ దేవత; ఓం బీజం, స్వాహాశక్తి అని కొనియాడబడుచున్నది.

శ్లో॥ కీలకం దూరదృష్టి స్స్యాత్ ప్రసాదే వినియుజ్యతే
న్యాసాది మూలమంత్రేణ కుర్యా త్ప్రియతమానసః ॥

తా॥ దూరదృష్టి కీలకముగా నగును. స్వప్న హనుమత్ప్రసాదమున వినియోగము చెప్పవలెను. ఇష్ట మనస్కుడై మూలమంత్రముతో న్యాసాదిక మొనర్చవలెను.

ధ్యానం :—

శ్లో॥ సమాగతానాగత వర్తమాన
వృత్తాంత విజ్ఞాన భరం త్రిలోక్యాః
దూరశ్రుతి ర్దూరగతస్య దర్శనం
స్వప్నే హనూమ న్మమ దేహి నిత్యమ్ ॥

తా॥ ఓ హనుమంతా! భూతభవిష్యద్వర్తమానముల యొక్క ముల్లోకములందలి వృత్తాంత విజ్ఞానమును, దూర శ్రవణ శక్తిని, దూరదృష్టిని ప్రతినిత్యమును స్వప్నమున నాకిమ్ము.

శ్లో॥ పురశ్చర్యావిధి స్తస్య నియ తాయుతసంఖ్యయా
దశాంశం తర్పణం జ్ఞేయం హోమ స్తస్య దశాంశకః॥

తా॥ ఆమంత్రమునకు పురశ్చర్య పదివేలుగా నియతమై యున్నది. అందు దశాంశము తర్పణము. అందు దశాంశము హోమముగా తెలియదగును.

శ్లో॥ వేదపారగ విప్రాణాం తద్దశాంశం తు భోజనం
ఏవం యః కురుతే విద్వాన్ హనుమత్పూజనం సదా ॥

తా॥ అందు దశాంశ సంఖ్యలో వేదమంతయు చదివిన బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. ఇట్లు ఎల్లప్పుడు హనుమత్పూజ నొనర్చుచు ఏ విద్వాంసుడొనర్చునో-

శ్లో॥ స సద్య స్సిద్ధి మాప్నోతి పరత్ర చ పరాం గతిః
పురశ్చర్యా విధౌ తస్మిన్ సమాప్తౌ కృపయా హరేః॥

తా॥ ఆతడు వెంటనే మంత్రసిద్ధి నందును. మంత్ర పురశ్చర్యా విధి పూర్తియగుట వలన వానర ప్రముఖుడగు హనుమంతుని యనుగ్రహము వలన పరమున ముక్తి లభించును.

శ్లో॥ మందవారే మహాభక్త్యా ప్రార్థయేత్ బ్రాహ్మణోత్తమాన్
త్యక్త్వా హంకార దంభాదీన్ పండితాన్ పంచసంఖ్యయా॥

తా॥ శనివారమున గర్వాహంకారముల వీడి భక్తితో పండితులగు నైదుగురు బ్రాహ్మణ శ్రేష్ఠులను ప్రార్థించవలెను.

శ్లో॥ ఆంజనేయార్చనాగారం నీత్వా బ్రాహ్మణ పుంగవాన్
సఘృతాన్ పాయసాపూపాన్ విపులాన్ గుడమిశ్రితాన్॥

తా॥ బ్రాహ్మణ శ్రేష్ఠులను ఆంజనేయుని పూజా మందిరమునకు తీసికొనివచ్చి నేతితో వండినవి, పాలుపోసి చేసినవి, పెద్దవి, బెల్లముతో చేసినవి అయిన అప్పములను-

శ్లో॥ హనూమతే నివేద్యాదౌ భోజయేత్ప్రార్థిత ద్విజాన్
ద్విజభుక్తావశేషం చ భుక్త్వా జపపరాయణః ॥

తా॥ ముందుగా హనుమంతునకు నివేదించి, మనము ప్రార్థించి తెచ్చిన బ్రాహ్మణులకు పెట్టవలెను. వారు తినిన పిదప మిగిలిన అపూపములను భుజించి జపపరాయణుడై-

శ్లో॥ ఆచమ్య విధివచ్ఛీఘ్రం జపే దష్టోత్తరం శతం
ఆంజనేయ పురోదేశే బ్రహ్మచర్యం సమాచరన్ ॥

తా॥ వెంటనే విధి ప్రకార మాచమన మొనర్చి నూటయెనిమిది పర్యాయములు జపించవలెను. ఆంజనేయుని యెదుట వసించుచు బ్రహ్మచర్యము నాచరించుచు-

శ్లో॥ అథ శ్శయనసంపన్న, అప్రమత్తః శనైః స్వపన్
స్వం మనోహర ముద్దిస్య కామయేత ఫలం తథా॥

తా॥ నేలపై పరుండువాడై గాఢముగ అప్రమత్తుడై నెమ్మదితో నిద్రించుచు మనసార తానాసించు ఫలము కోరుకొనవలెను.

శ్లో॥ తతో వానరరూపేణ బాలబ్రాహ్మణ వేషతః
అథవా స్వస్వరూపేణ హనుమాన్ స్వప్నగో భవేత్॥

తా॥ ఏమ్మట వానరరూపమున కాని, బ్రాహ్మణ బాలుని వేషమునకాని, లేదా తన హనుమద్రూపముననే కాని ఆంజనేయుడు కలలోకి వచ్చును.

శ్లో॥ తస్య వాంఛిత కార్యాణి విజ్ఞాప్య ప్రహసన్ కపిః
దత్వా కించి దభిజ్ఞానం సహసాఽం తర్హితో భవేత్॥

తా॥ వ్రతము నాచరించువాని కోరిక తెల్పి హనుమంతుడు నవ్వుచు తన గురుతును కూడ కల్పించి వెంటనే అంతర్ధానము నందును.

శ్లో॥ భక్తస్య వానరం రూపం స్వప్నలబ్ధం భవే ద్యది
తేన శ్రేయో భవే చ్ఛీఘ్రం నాత్ర కార్యా విచారణా॥

తా॥ భక్తునకు కలలో వానరరూపము కానవచ్చిన యెడల వెంటనే హనుమంతునివలన మేలుజరుగును. ఇందు సందేహింప బనిలేదు.

శ్లో॥ అభక్తస్య భవే త్స్వప్నః వానరాకార గోచరః
శ్రేయాంసి తస్య నశ్యంతి తతః ప్రతికృతి ర్భవేత్॥

తా॥ హనుమద్భక్తుడు కానివానికి అట్లు స్వప్నమున వానరాకారము కనప్పటినయెడల వానికి కావలసిన మేలు చెడును. ఆపైన ఇంకను అనుకొన్న దానికంటె భిన్నముగా జరుగును.

శ్లో॥ అత్రై వోదాహరం తీమం ఇతిహాసం పురాతనం
యస్య శ్రవణ మాత్రేణ సర్వపాపైః ప్రముచ్యతే॥

తా॥ ఈ విషయమున ఈ ప్రాచీనమైన ఇతిహాసమును

ఉదాహరణగా చెప్పుచున్నారు. దీనిని వినుటవలననే జనుడు తన పాపము లన్నిటినుండియు ముక్తుడగును.

శ్లో॥ అస్తి కాశీపురీ ధన్యా సర్వపుణ్యఫలప్రదా
మోక్షలక్ష్మ్యాః పతాకేవ సర్వలోకేషు విశ్రుతా॥

తా॥ సర్వ పుణ్యఫలముల నిచ్చునదై ధన్యమైన కాశీపట్టణ మున్నది. అది మోక్షలక్ష్మికి పతాకవలె సమస్త లోకములందు ప్రసిద్ధికెక్కి యున్నది.

శ్లో॥ తత్రాస్త్యేకాదశీమధ్యే కేదారేశ్వర వాటికా
తస్యాస్తు దక్షిణే భాగే రామవాటి విరాజతే॥

తా॥ అచ్చట ఏకాదశీ మధ్యమున కేదారేశ్వర వాటికయున్నది. దానికి దక్షిణభాగమున రామవాటి ప్రకాశించుచు చున్నది.

శ్లో॥ రామవాట్యాః పురోభాగే గంగా కల్లోలమాలినీ
తత్రాస్తే జానకీనాథః సాకేత ఇవ మూర్తిమాన్॥

తా॥ రామవాటికి ముందు భాగమున గంగానది యందు సీతాపతియగు శ్రీరామచంద్రుడున్నాడు. అయోధ్య యందు సాక్షాత్తుగా రాముడున్నట్లిచ్చట రాముని విగ్రహ ముండెను.

శ్లో॥ తత్పాదాంభోజ పీఠాయాం లబ్ధతృష్ణో నిరంతరం
హనూమా నంజనీసూనుః భక్తానుగ్రహతత్పరః॥

తా॥ ఆతని పాదపద్మములను చూచుటలో నిరంత

రము కోరికలు కల్గియుండి భక్తుల ననుగ్రహించుటలో తత్ప
రుడగు అంజనీ కుమారుడగు హనుమంతుడు—

శ్లో॥ దదాతి భక్తలోకస్య సర్వాభీష్టాని మారుతిః
తత్రాస్తే ధార్మికో నామ బ్రాహ్మణో వేదపారగః॥

తా॥ తన భక్తులకు కోరిన కోర్కెల నన్నిటిని ఇచ్చు
చుండును. అచ్చట వేదములన్నియు చదివిన ధార్మికుడను
బ్రాహ్మణుడు కలడు.

శ్లో॥ రామవాటీ గుహామధ్యే కృతవాసో నిరంతరం
తస్య పుత్రో జితామిత్రో ధర్మకీర్తి స్తు నామతః॥

తా॥ ఆతడు రామవాటిగుహ మధ్యభాగమున నిరం
తరము నివశించు చుండువాడు. ఆతని కుమారుడు శత్రువుల
జయించువాడు. ధర్మకీర్తియను పేరుకలవాడు.

శ్లో॥ సదా వినయసంపన్నో సదాచారో జితేంద్రియః
పితృసేవాపరో నిత్యం సౌమ్య ష్షోడశహాయనః॥

తా॥ ఆతడు ఎల్లప్పుడు వినయసంపద కలవాడు.
ఇంద్రియనిగ్రహమున్న వాడు. నిత్యము తల్లిదండ్రుల సేవించు
వాడు. సౌమ్యగుణము కలవాడు. పదునారేండ్ల వయస్సు
వాడు.

శ్లో॥ సర్వశాస్త్రార్థ తత్వజ్ఞో నిత్యం వృద్ధోపసేవనః
న కదాచి న్మహాప్రాజ్ఞో ధర్మకీర్తి రనామయః॥

తా॥ సర్వశాస్త్రముల అర్థమును, తత్వమును తెలి
సినవాడు, నిత్యము పెద్దలను సేవించువాడు. మహాప్రాజ్ఞు
డగు ఆ ధర్మకీర్తి ఎల్లప్పుడు రోగమనునదిలేక ఉండువాడు.

శ్లో॥ తథాచ మాతాపితరౌ సాధ్వీం జాయాంస్వకామపి
దుర్భిక్ష పీడితా నేతాన్ పర్యాలోక్య పునః పునః॥

తా॥ అట్లుండి తల్లిదండ్రులు, ఉత్తమురాలగు తన భార్యయు దారిద్ర్యబాధ ననుభవించుట చూచి మిక్కిలి ఆలోచించి—

శ్లో॥ దారిద్ర్యం హర్తుకామ స్సః ధనసంగ్రహ ణేచ్ఛయా
స్వయ మేకచరో విప్రః దూరదేశాంతరం గతః॥

తా॥ దారిద్ర్యమును పోగొట్టు కోరిక కల యాతడు ధనము నార్జింప నెంచినవాడై తానొక్కడే స్వయముగా బయలుదేరి ఆ బ్రాహ్మణుడు దూరదేశము పోయెను.

శ్లో॥ అతీత్య దూర మధ్వానం గోకర్ణ క్షేత్ర మావిశత్
దృష్ట్వా తత్ర మహాత్మానం గోకర్ణేశ్వర మవ్యయమ్॥

తా॥ చాలాదూరముగడచి గోకర్ణ క్షేత్రము చేరెను. అచ్చట అవ్యయుడగు మహానుభావుని గోకర్ణేశ్వరుని చూచి

శ్లో॥ తస్యాఽధ్వశ్రమయా సద్యః గోకర్ణేశ ప్రసాదతః
విసంస్మర స్వకాన్ బంధూన్ కదాచి ద్వాసనావశాత్॥

తా॥ వెంటనే ఆతడు ప్రయాణ బడలికవలనను, గోకర్ణేశుని యనుగ్రహామునను, వాసనా వశమునను తమ బంధువులను మరచెను.

శ్లో॥ సంకీర్తయ న్సంస్మరయం శ్చ నిత్యం
సంపూజయం శ్చాప్యభిషేచయ న్సదా

చిరం స్తువం స్తోత్రభరై రనేకథా
నినాయ గోకర్ణతలే సమాబహూః॥

తా॥ నిత్యము దేవదేవుని కీర్తించుచు, సంస్మరించుచు, ఆ పరమశివునకు సంతోషముతో అభిషేకమొనర్చుచు పూజించుచు, స్తోత్రములతో చాలసేపు అనేకరీతుల స్తుతించుచు ఆ గోకర్ణక్షేత్ర ప్రదేశమున బహుకాలము గడిపెను.

శ్లో॥ ఇతి నిరవధికం త ద్ధర్మకీర్తే ర్కృతాత్మనః
తద్వృత్తాంత మపి జ్ఞాత్వా దేశదేశాంతరే ష్వపి॥

తా॥ ఈ విధముగా ఎడబాటులేని దైవకార్యములతోడి ఆ యతాత్ముడగు ధర్మకీర్తియొక్క వృత్తాంతమును తెలిసికొని దేశదేశాంతములందును

శ్లో॥ బాంధవా స్సకలా స్తస్య మాతాపిత్రాదయ స్తథా
దుఃఖితాః పరమం కాస్యాం కాలే కాలేచ సర్వదా॥

తా॥ తల్లిదండ్రులు మొదలుగాగల ఆతని సమస్త బంధువులు ఎల్లప్పుడు మిక్కిలి దుఃఖించుచు కాశీయందుండి

శ్లో॥ అథ యాత్రాప్రదేశేనా నానాదేశ సమాగతాన్
బ్రాహ్మణా న్క్షత్రియా న్వైశ్యాన్ శూద్రా న్సంకీర్ణ వానపి॥

తా॥ యాత్రార్థమై నానాదేశములనుండి వచ్చెడి బ్రాహ్మణులను, క్షత్రియులను, వైశ్యులను, శూద్రులను, సంకరజాతులవారిని

శ్లో॥ అపృచ్ఛతాం కృశా దీనా తద్వియో గాతికాతరే
జననీ జనక శ్చాపి ధర్మకీర్తే మహామతేః॥

తా॥ ఆతని వియోగమువలన భయమందినవారై కృశించి దీనులై అడుగజొచ్చిరి. బుద్ధిశాలియగు ధర్మకీర్తి యొక్క తల్లిదండ్రులు

శ్లో॥ అహో ధన్యాః మహాపుణ్యాః పాంథాః పుత్రవతాం వరాః
కం న దృష్టో భవద్భిస్సః బాలో షోడశహాయనః॥

తా॥ ఓహో! ధన్యులారా! మహాపుణ్యులారా! బాటసారులారా! పుత్రవతమొనర్చినవారిలో శ్రేష్ఠులారా! మీకు పదునారేండ్ల వయస్సుకల బాలుడు కానరాలేదా?

శ్లో॥ పుత్రో ఽస్మాకం సదా దీనః ధర్మకీర్తిశ్చ నామతః
సర్వశాస్త్రార్థ తత్వజ్ఞః సర్వవేదాంత పారగః॥

తా॥ మా పుత్రుడు ఎల్లప్పుడు దీనుడై కనబట్టువాడు. పేరు ధర్మకీర్తి. సర్వశాస్త్రార్థతత్వము తెరిగినవాడు. సమస్తోపనిషత్తుల సాంతమెరిగినవాడు.

శ్లో॥ న బ్రూతే నిష్ఠురం క్వాపి శప్తో వాఽన్యజనైరపి
ఏవం విధో మహాప్రాజ్ఞః నిష్క్రాంతః కాశికాతలాత్॥

తా॥ ఎచ్చటను కఠినముగ మాటలాడడు. శత్రువుల చేతకూడ నిందింపబడడు ఇటువంటి మహాజ్ఞాని కాశీప్రదేశమునుండి వెడలిపోయినాడు.

శ్లో॥ కం దేశ మాశ్రిత స్సాధుః స ధన్యో దేశసత్తమః
ఏతే సర్వే వయం నూనం నిర్భాగ్యా స్తద్వియోగినః॥

తా॥ ఆ సజ్జను డెచ్చటకు చేరినాడో ఆ మంచి దేశము

ధన్యమైనది. ఆతని నెడబాసిన ఈ మేమందరము నిశ్చయ
ముగా దురదృష్టవంతులము.

శ్లో॥ అతిక్రాంతో బహుః కాలః వినా తన్ముఖదర్శనం
కదా ద్రక్ష్యామహే పుత్రం సర్వభూత దయాపరమ్॥

తా॥ ఆతని ముఖమును చూచు భాగ్యము పోయి
చాలాకాలము గడచినది. సర్వప్రాణులయందు దయకల ఆ
పుత్రుని ఎప్పుడు చూడగలమోకదా!

శ్లో॥ శ్రావయిష్యసి వృత్తాంతం కో వా పుత్రస్య వశ్శుభం
ధర్మకీర్తిం యది ప్రాజ్ఞం న వా ద్రక్ష్యామహే వయమ్॥

తా॥ ఎవరైన శుభప్రదమగు మా పుత్రునివృత్తాంత
మును విన్పింతురా? విజ్ఞానియగు ధర్మకీర్తిని మేము చూడ
లేక పోయినచో

శ్లో॥ నూనం త్యజామహే దేహాన్ గంగాయాం పావకేఽపివా
ఏవం కష్టవతో బంధూన్ ధర్మకీర్తే ర్మహాత్మనః॥

తా॥ మా దేహములను నిశ్చయముగా పవిత్రమగు
గంగయందు విడచెదము అని ఇట్లు కష్టమందెడి ఆ మహా
త్ముడగు ధర్మకీర్తి యొక్క బంధువులతో.

శ్లో॥ సాయంత్రికా జనా ప్రోచుః న దృష్టో భవతాత్మజః
ఇతి గద్గదయా వాచా న శక్తా వక్తు మాస్థితాః॥

తా॥ సాయంకాలమున నేతెంచిన జనులు 'మీ బిడ్డ

పూకు కన్పడలేదు, అని పల్కి దగ్గతికతో మాటాడజాలని వారై నిలచిరి.

శ్లో॥ అథాంతరే మహాప్రాజ్ఞః కశ్చిద్బ్రాహ్మణపుంగవః
కాశ్యామేవ కృతావాసో సుతపో నామ వై ద్విజః॥

తా॥ ఇంతలోనే మహాజ్ఞానియు, బ్రాహ్మణ శ్రేష్ఠుడును కాశీలో నివసించుచున్న సుతపుడు అను పేరుగల బ్రాహ్మణుడు

శ్లో॥ ఉవాచ ధార్మికం విప్రం వచనం వదతాంవరః
అలం విద్వన్విషాదేన నిషీద పురతో మమ॥

తా॥ మాట నేర్పరియగు నాతడు ఆ ధార్మిక విప్రునితో నిట్లనెను. ఓ విద్వాంసుడా! దుఃఖించవలదు. నా యెదుట కూర్చుండుము.

శ్లో॥ శ్రోతు మర్హసి మద్వాక్యం మాభూత్కాలవిపర్యయః
స్వప్నాఖ్య హనుమన్మంత్రః ప్రసిద్ధః జగతాం త్రయే॥

తా॥ ఆలస్యము చేయక నామాటవినుము స్వప్నాఖ్య హనుమన్మంత్రము ముల్లోకములందు ప్రసిద్ధమైనది.

శ్లో॥ జపంత స్తం మహామంత్రం బహవో నియతవ్రతాః
శుభస్వప్నోపదేశేన కార్యసిద్ధి మవాప్నుయాత్॥

తా॥ చాలామంది నియతవ్రతులగువారు ఆ మహామంత్రమును జపించుచు శుభస్వప్నమను నిమిత్తముతో కార్యసిద్ధిని పొందిరి.

శ్లో॥ తస్మాత్త్వ మపి విప్రేంద్ర ధార్మికప్రియయా సహ
ఇమం మంత్రం గృహాణాశు మయా తే హ్యుపదిశ్య తే॥

తా॥ ఆకారణమున ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! నీవుకూడ నీ ధర్మపత్నితో కూడి ఈ మంత్రమును వెంటనే స్వీకరింపుము. నీకు నేనుపదేశింతును.

శ్లో॥ స్వప్నలబ్ధో హనూమాన్తే పుత్రవార్తాం ప్రవక్ష్యతి
యది వా ద్రక్ష్యసే నూనం త్వమపి బ్రాహ్మణోత్తమ॥

తా॥ స్వప్నమునందు సాక్షాత్కరించెడి ఆ హనుమంతుడు నీ పుత్రుని వార్తను తెలుపగలడు. లేదా ఓ బ్రాహ్మణోత్తమా! నిశ్చయముగ నీవుకూడ నీ పుత్రుని చూడగలవు.

శ్లో॥ మా కురుష్వాఽత్ర సందేహం సుఖితోఽపి భవిష్యసి
ఇత్యుక్త్వా వచనం విప్రం సుతపో ధార్మికం తథా॥

తా॥ ఈ విషయమున సందేహింపవలదు. నీవు సుఖవంతుడవు కాగలవు అని యట్లు ఆ ధార్మికునితో సుతపుడను బ్రాహ్మణుడు పల్కి,

శ్లో॥ విదేశ స్వాప్నికం మంత్రం సర్వేషాం క్షేమదాయకం
సోఽపి విప్రో జితాహారః జితక్రోధో జితశ్రమః॥

తా॥ అందఱకు క్షేమదాయకమగు ఆ స్వప్నాఖ్య హనుమన్మంత్రము నుపదేశించెను. ఆధార్మిక బ్రాహ్మణుడు కూడ ఆహారము వీడి, క్రోధమునుజయించి, శ్రమను లెక్కించనివాడై

శ్లో॥ జజాప పరమం మంత్ర ముపదిష్టం మహాత్మనా
రామవాట్యాం కృతావాసం త్రినేత్రం భక్తవత్సలమ్॥

తా॥ ఆ సువ్రత మహాత్మునిచే ఉపదేశింప బడిన ఉత్తమ మంత్రమును జపించెను. రామవాటిలో వేంచేసి యున్న శివస్వరూపుడును, భక్తులయం దాదరముకలవాడును,

శ్లో॥ రాఘవాభిముఖం వీరం హనుమంతం హృది స్మరన్
పఠతిస్మ మహామంత్రం పుత్రదర్శన లాలసః॥

తా॥ శ్రీరాముని ఎదుట నున్న వీరుడగు హనుమంతుని హృదయమున స్మరించుచు పుత్రుని చూడవలె నను కుతూహలముకలవాడై మహామంత్రము పఠింపసాగెను.

శ్లో॥ ఏవం జపతి విప్రేంద్రే మంత్రరాజం ధార్మికే
బాలబ్రాహ్మణ రూపేణ మార్తాండసమ తేజసా
స్వప్నలబ్ధోఽంజనాసూనుః పుత్రవార్తా న్యవేదయత్ ॥

తా॥ ఇట్లు బ్రాహ్మణ శ్రేష్ఠుడగు ధార్మికుడు మంత్ర రాజమును జపించగా అంజనాసూనుడగు హనుమంతుడు బాలబ్రాహ్మణ రూపమున సూర్య సమానమగు తేజస్సుతో స్వప్నమున కానవచ్చి పుత్రవార్తను తెల్పెను.

శ్లో॥ ఆనయిష్యామి పుత్రం తే ప్రేరయిత్వా మతిం తథా
ఉత్తిష్ఠ వత్స! భద్రం తే న ఖేదం ప్రాప్తు మర్హసి ॥

తా॥ వత్సా! లెమ్ము. నీకు మేలగుగాక. నీ పుత్రుని బుద్ధిని ప్రేరేపించి తీసికొనిరాగలను. నీవు దుఃఖింపవలదు.

శ్లో॥ తవ పుత్రో మహాప్రాజ్ఞో ధర్మకీర్తి రనామయః
గోకర్ణనాయకస్థానే నివస న్నిర్మలాశయః ॥

తా॥ మహాజ్ఞానియగు నీ పుత్రుడు ధర్మకీర్తి ఏ రోగము లేనివాడై నిర్మలమగు ఆశయము కల్గి గోకర్ణేశ్వరుని కడ నివసించుచు-

శ్లో॥ సేవతే ఽహర్నిశం శంభో శ్చరణాంబురుహ ద్వయం
సుఖేన వర్ధతే జీవన్ తస్యానుగ్రహ వైభవాత్ ॥

తా॥ రాత్రింబవళ్ళు శివపాద పద్మ ద్వయమును సేవించుచున్నాడు. సుఖముగ జీవించుచున్నాడు. ఆతని యనుగ్రహామువలన అట్లు జీవించుచు-

శ్లో॥ అచిరా దేష్యతి స్వైరం ధర్మకీర్తి స్తవాత్మజః
ఇతి త్వత్పుత్ర వృత్తాంత మాఖ్యాతు మహ మాగతః॥

తా॥ నీ కుమారుడగు ధర్మకీర్తి తనంతట తానే చాల తొందరలోనే రాగలడు. ఈ నీపుత్రుని వృత్తాంతము తెల్పుటకు వచ్చితిని.

శ్లో॥ స్వప్నలబ్ధ మిమం విద్ధి హనూమంత మిహాగతం
స్వస్తి తే ఽస్తు గమిష్యామి సమాగచ్ఛతి తే సుతః ॥

తా॥ ఇచ్చటకు వచ్చిన స్వప్నలబ్ధుడగు నన్ను హనుమంతునిగా తెలిసికొనుము. నీకు మేలగుగాక! నేను వెళ్ళుచున్నాను. నీ కుమారుడు రాగలడు.

శ్లో॥ ఇత్యుక్త్వా కపినాథోఽపి క్షణా దంతరధీయత
ధార్మికోఽపి మహాతేజాః స్వప్నా దుత్థాయ వేగతః ॥

తా॥ అని పల్కి వానరేశ్వరుడు క్షణములో అంతర్ధానము పొందెను. తేజోవంతుడగు ధార్మికుడు నిద్దురనుండి వేగముగ లేచి-

శ్లో॥ కశా హత ఇవాకస్మాత్సంభ్రాంతహృదయోఽభవత్
తతః ప్రభాతే బంధూనాం రాత్రివృత్తం నివేద్య సః ॥

తా॥ కొరడాతో కొట్టినట్లు హఠాత్తుగా తొట్రుపడు హృదయము కలవాడయ్యెను. పిమ్మట ఉదయముననే అతడు తన బంధువులకు రాత్రి జరిగిన స్వప్న వృత్తాంతము దెల్పి-

శ్లో॥ తై ర్బహుశ్లాఘితో విప్రః సంస్తువన్ కపినాయకం
ప్రతీక్ష్య పుత్రాగమనం తస్థౌ బ్రాహ్మణసత్తమః ॥

తా॥ వారిచే మిక్కిలి కొనియాడబడినవాడై ఆ బ్రాహ్మణుడు కపివీరుని స్తుతించుచు పుత్రుని రాకను ప్రతీక్షించుచుండెను.

శ్లో॥ అథాంతరే మహాదేవో గోకర్ణస్థల నాయకః
ఇమేష ప్రేషితం శీఘ్రం ధర్మకీర్తిం ద్విజాత్మజమ్॥

తా॥ ఇంతలో మహాదేవుడు, గోకర్ణస్థల నాయకుడగు గోకర్ణేశ్వరుడు బ్రాహ్మణపుత్రుడగు ధర్మకీర్తిని వెంటనే పంపదలంచెను.

శ్లో॥ చిత్తశుద్ధి ప్రభావేన సేవయోపాధిహీనయా
భక్త్యా చావ్యభిచారిణ్యా ధర్మకీర్తిస్తు తారితః॥

తా॥ చిత్తశుద్ధి ప్రభావము వలన, కపటములేని సేవ వలన అవిచలితమగు భక్తి వలనను ధర్మకీర్తి తరింప జేయబడెను.

శ్లో॥ ఆంజనేయ ప్రభావేన సమృద్ధా స్సర్వసంపదః
ప్రాప్య కైవల్యలక్ష్మీం చ జగామ స్వపురం ద్విజః ॥

తా॥ ఆంజనేయుని ప్రభావమువలన సర్వసంపదలు సమృద్ధి నందినవి. మోక్ష లక్ష్మిని కూడ పొందినవాడై ధర్మకీర్తి తన పట్టణమున చేరెను.

శ్రీ పరాశరః—

శ్లో॥ స్వప్నాఖ్య హనుమన్మంత్ర ప్రసాదా ద్ధార్మికో ద్విజః
ప్రోషితం సుచిరం కాలం పుత్రం ప్రాప్య పున స్స్వతః॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు. స్వప్నాంజనేయ మంత్రము యొక్క అనుగ్రహము వలన ధార్మికుడను ఆ బ్రాహ్మణుడు చాలా కాలముగా దూరదేశమున నున్న పుత్రుని మరల తనంతట రాగా పొందె.

శ్లో॥ భుక్త్వా యథేప్సితా న్భోగాన్ అంతే మోక్ష ముపాగతః
ఇతి తన్మంత్ర మాహాత్మ్యం గదితం విస్తరేణ తే ॥

తా॥ కోరిన భోగములన్నిటి ననుభవించి చివరకు మోక్షము నందెను. అని ఇట్లు స్వప్నాఖ్య హనుమన్మంత్ర మాహాత్మ్యము విస్తరించి ఓ మైత్రేయా నీకు చెప్పబడినది.

శ్లో॥ గోపనీయం ప్రయత్నేన మయి శృణ్వత తద్వశః

తా॥ నేను చెప్పిన ఈ హనుమన్మంత్రమును ప్రయత్నించి రహస్యముగా నుంచదగును.

శ్లో॥ అద్యాపి కాశీపుర రామవాట్యాం
జప ప్రణామ స్తుతికృజ్జగస్య
భవ్యం చ భూతం చ భవిష్య దేవం
నివేదయే త్స్వప్నగతో హనూమాన్ ॥

తా॥ నేటికిని కాశీపురమందలి రామవాటిలో జపము, నమస్కారము, స్తోత్రము చేయు జనులకు స్వప్నగతుడగు హనుమంతుడు భూత భవిష్య ద్వర్తమానములను తెల్పును.

ఇతి శ్రీ పరాశరసంహితాయాం
పరాశర మైత్రేయసంవాదే
పంచముఖ హనుమన్మంత్ర వివరణే
స్వప్నహనుమన్మంత్ర ప్రభావ వర్ణనం నామ
షట్పంచాశత్పటలః

సప్తచత్వారింశ త్పటలః

# మంత్రసంస్కార కథనం

శ్రీ పరాశరః—

శ్లో॥ అన్యం విశేషం వక్ష్యామి మైత్రేయ! శ్రుణు తత్త్వతః ॥
మంత్రాణాం హి విభాగోఽస్తి జీవనాఽజీవ భేదతః ॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు. ఓ

మైత్రేయా! ఇంకొక విశేషమును చెప్పుచున్నాను. శ్రద్ధగా వినవలసినది. జీవనములు, అజీవనములు అను భేదములతో మంత్రములకు విభాగముకలదు.

శ్లో॥ సంస్కృతా జీవనా మంత్రాః జీవత శ్చాఽపి తే స్మృతాః
దశసంస్కార హీనా యే మంత్రాః మంత్రవిదాం వర ॥

తా॥ సంస్కరింపబడిన మంత్రములు జీవన మంత్రములు. అవి ప్రాణము కలవిగా తెలియబడుచున్నవి. ఓ మంత్ర విదులలో శ్రేష్ఠుడా! దశవిధ సంస్కారములు లేని వే మంత్రము లున్నవో-

శ్లో॥ అజీవా ఇతి తే ప్రోక్తాః అజీవా శ్చాపి తే స్మృతాః
ద్వివిధానాం తు మంత్రాణాం విశేషో విద్యతే మహాన్
సద్య స్సిధ్యంతి జీవం త స్త దన్యే తు విలంబితాః ॥

తా॥ అవి అజీవములని చెప్పబడుచున్నవి. అవి ప్రాణ రహితములుగా తెలియదగినవి. రెండు విధములగు మంత్రములకు మిక్కిలి వ్యత్యాసము కలదు జీవ మంత్రములు వెంటనే సిద్ధించును. అజీవములు ఆలస్యముగ సిద్ధించును.

శ్రీ మైత్రేయః—

శ్లో॥ క్లేశదశాఽపి సంస్కారాః మంత్రాణాం శుద్ధ హేతవః
త న్సమాచక్ష్వ యోగీంద్ర! లోకానుగ్రహ హేతునా॥

తా॥ శ్రీ మైత్రేయ మహాముని యడుగుచున్నారు.

ఓ పరాశర మహామునీ! సంస్కారములు పదియు క్లిష్టములే యైనను అవి మంత్రముల శుద్ధికి కారణములు. కావున ఓ యోగి వరా! లోకానుగ్రహ కారణమున వానిని నాకు చెప్పవలసినది.

శ్రీ పరాశరః—

శ్లో॥ జననం జీవనం పశ్చా త్తాడనం బోధనం తథా
అథాఽభిషేకో విమలీ కరణాఽఽప్యాయనీ పునః
తర్పణం దీపనం గుప్తిః దశైతా మంత్ర సంస్క్రియాః॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు. జననము జీవనము, తాడనము, బోధనము, అభిషేకము, విమలీ కరణము, ఆప్యాయనము, తర్పణము, దీపనము, గుప్తము అని మంత్ర సంస్కారము లీపదియు చెప్పబడినది.

శ్లో॥ లక్షణాని క్రమే ణాసాం మత్తో నిగదితాః శృణు
యచ్ఛ్రుత్వా పరమాం ప్రీతిం మైత్రేయాఽధిగమిష్యసి॥

తా॥ వీనికి క్రమముగా నాచే లక్షణములు చెప్పబడుచున్నవి వినుము. వీనిని వినుటవలన మైత్రేయా! నీవు మిక్కిలి ఆనందము పొందగలవు.

శ్లో॥ సౌవర్ణే రజతే వాఽపి తామ్రే వా భాజనే తథా
కాదళే వాఽపి పాలాశే పద్మపత్రద్వయేఽపి వా ॥

తా॥ సువర్ణపాత్ర యందుకాని, రజతపాత్రి యందు కాని, రాగిపాత్రయందుకాని లేదా అరటియాకు నందుకాని, మోదుగఆకునందు గాని లేదా రెండు పద్మపత్రము లందుకాని-

శ్లో॥ నూతనం ధౌతవస్త్రం చ యథాశక్తి ప్రకల్పయేత్
తస్యోపరి మహాశుభ్రాన్ అవ్రణాన్ శాలితండులాన్
విన్యసేన్నిభృతస్వాంతః స్మరన్ స్వాభీష్టదైవతమ్ ॥

తా॥ క్రొత్తదగు తెల్లని వస్త్రమును యథాశక్తిగ నేర్పరుపవలెను. దానిపై మిక్కిలి శుభ్రములైనట్టి, విరుగనట్టి, శాలి ధాన్యపు బియ్యమును నిశ్చల మనస్కుడై తన ఇష్టదైవమును స్మరించుచు నుంచవలెను.

శ్లో॥ గురుం సంపూజ్య విధివన్మంత్రారాధన తత్పరః
తండులోపరి పంచాశ దక్షరాణ్యలిఖేత్సుధీః ॥

తా॥ యథావిధిగా గురువును పూజించి మంత్రారాధన తత్పరుడై ఆ బియ్యముపై ఏబది అక్షరములను విజ్ఞుడగునాతడు లిఖించవలెను.

శ్లో॥ పూజయేత్ప్రాఙ్ముఖస్థాని గంధపుష్పాక్షతైః శుభైః
నివేదయేద్గుడం చైవ ఫలం వా క్షీరమేవ వా
ప్రదక్షిణ నమస్కారాన్కుర్యాత్తానన్యమానసః ॥

తా॥ తూర్పు ముఖముననున్న అక్షరములను శుభప్రదములగు గంధము, పుష్పము, అక్షతలతో పూజింపవలెను. పిదప బెల్లమునుకాని, పండును లేదా పాలనుకాని నివేదన మొనర్చవలెను. మనస్సు నిలకడగా నుంచి ప్రదక్షిణ నమస్కారము లొనర్చవలెను.

శ్లో॥ తత స్స్వాభీష్ట మంత్రస్య వర్ణాన్పాత్రాత్సముద్ధరేత్
యదక్షరం లిఖిత్వాశు వర్ణానాపూర్యతే బుధః ॥

తా॥ పిమ్మట తాను కోరుచున్న మంత్రముయొక్క వర్ణములను పాత్రనుండి తీయవలెను. ఏ అక్షరము లిఖించి పండితుడగువాడు శీఘ్రముగ వర్ణములను పూరించునో-

శ్లో॥ తం వర్ణం పూర్ణపాత్రస్థం మాంత్రికః ప్రవిలోమయేత్
ఇతి సర్వాక్షరా ణ్యేవ మంత్రపూర్వా ణ్యనుక్రమాత్॥

తా॥ పూర్ణపాత్రయందున్న ఆ వర్ణమును మాంత్రికుడు విలోమ మొనర్చవలెను. ఇట్లు మంత్రపూర్వముగ అన్ని అక్షరములను క్రమము ననుసరించి-

శ్లో॥ అన్యత్ర విలిఖే త్పాత్రే పూర్వతో ధృతిపూర్వకం
ఇదం జనన మిత్యాహుః మంత్రస్యాఽఽదిమ సంస్క్రియాం

తా॥ పూర్వభాగము నుండి అక్షరములను వేరొక పత్రము నందు చక్కగా లిఖించవలెను. మంత్రమునకు మొదటిదగు ఈ సంస్కారమును మంత్రజనన మందురు.

శ్లో॥ లిఖితానాం తు వర్ణానాం సమ్య క్పాత్రాంతరే తథా
ప్రాణం ప్రతిష్ఠా విధినా ధావయే న్మంత్రవర్ణకాన్ ॥
ఇదం జీవన మిత్యాహుః ద్వితీయా సంస్క్రియా పరా ॥

తా॥ అట్లు వేరొక పాత్రలో చక్కగా లిఖించిన పిదప మంత్ర వర్ణములను ప్రాణప్రతిష్ఠా విధితో కడుగవలెను. దీనిని రెండవ సంస్కారమునకు సంబంధించిన జీవనమందురు.

శ్లో॥ లిఖితాక్షర మంత్రస్య సముచ్చారణ పూర్వకమ్
సుగంధ పుష్పమాల్యాద్యైః పాత్రేస్మిన్ లిఖితాక్షరే
తాడనం పాణినా వేగాత్ పంచవారం ప్రయత్నతః ॥

తా॥ వ్రాయబడిన అక్షరములుకల మంత్రమును ఉచ్చరించుచు సుగంధము, పుష్పములు, మాలికలు మున్నగు వానిని ధరించిన చేతితో వేగముగా పాత్రయందు వ్రాసిన అక్షరములపై ప్రయత్నపూర్వకముగా ఐదుపరాయములు వేగముగా కొట్టవలెను

శ్లో॥ ఇదం తాడన మిత్యాహుః తృతీయా సంస్క్రియా పరా।

తా॥ ఇదియే మూడవ సంస్కారమగు తాడన మన బడును.

శ్లో॥ తాడితస్యైవ మంత్రస్య పురతో వినయాన్వితః
తాడనా ద్యపరాధ న్త్వై సద్య ఏవ క్షమాపయేత్॥

తా॥ తాడన మొనర్చిన మంత్రమునకు ఎదుట వినయముతో నుండి తాడనాదికముచే నేర్పడిన అపరాధమునకు వెంటనే క్షమాపణ చెప్పుకొనవలెను.

శ్లో॥ బోధయే త్ప్రియవాక్యై శ్చ త్వ దధీనోఽహ మిత్యపి
ఇదం బోధన మిత్యాహుః చతుర్థీ సంస్క్రియా పరా॥

తా॥ నేను నీ అధీనుడననుచు ప్రియవాక్యములతో బోధించవలెను. ఇది బోధనమనబడు నాల్గవ సంస్కారమగును.

శ్లో॥ తత్ర పంచామృతైః పాత్రే స్నాపనం విధినా చ యత్
లిఖితాక్షర మంత్రస్య సముచ్చారణ పూర్వకం
అభిషేక మిదం ప్రాహుః పంచమీ సంస్క్రియా పరా॥

తా॥ పిదప యథావిధిగా పంచామృతములతో పాత్ర యందు లిఖింపబడిన అక్షరములు కల మంత్రమునకు ఉచ్చా రణ పూర్వకముగా స్నానము పూర్తి చేయవలెను. ఇది అభి షేకమనబడు ఐదవదగు సంస్కారము.

శ్లో॥ అభిషిక్తస్య మంత్రస్య లిఖితాక్షర రూపిణః
మలాపకర్షణార్థాయ క్షాళయే చ్ఛుద్ధవారిణా
విమలీకరణం ప్రాహుః షష్ఠసంస్కార సంజ్ఞకః ॥

తా॥ అభిషేకమొనర్చి వ్రాయబడిన అక్షర రూప మున నున్న మంత్రమునకు మాలిన్యమును తొలగించుటకై శుద్ధజలముతో క్షాళన మొనర్చవలెను. ఈ ఆరవ సంస్కా రమును విమలీకరణమందురు.

శ్లో॥ ఫలాపూపాది సంపూర్ణ శర్కరా ఘృతపాయసైః
శాల్యన్న సూపశాకాద్యై ర్నైవేద్యై రమృతోపమైః॥

తా॥ పండ్లు, అప్పములు, మిక్కిలిగా పంచదార వైచిన నేతితో కూడిన పాయసములతోను, శాలిధాన్యపు అన్నము, పప్పు, కూరలు మున్నగువానితో అమృతమువలె నున్న నైవేద్యము సమర్పించవలెను.

శ్లో॥ సుగంధ పుష్పమాలాద్యై శ్శోభితై ర్మృదులాంబరైః
లిఖితం శోభితం మంత్రం ముహు రాప్యాయయే త్సుధీః
ఇద మాప్యాయనం ప్రాహు స్సప్తమీ సంస్క్రియా పరా॥

తా॥ సుగంధ, పుష్ప, మాలికాదులతోను, మృదుల

వస్త్రములతో ప్రకాశించువానితో పండితుడగువాడు వ్రాయ బడి శోభించు మంత్రమును మరల మరల తృప్తిగా గావించవలెను. దీనినే ఏడవ సంస్కారమగు ఆప్యాయన మందురు.

శ్లో॥ లిఖితాక్షర మంత్రస్య సముచ్చారణ పూర్వకం
గంగోదకై ర్గవాం క్షీరై ర్నారికేళ జలేన వా ॥

తా॥ లిఖితాక్షరమగు ఆ మంత్రమును ఉచ్చారణ పూర్వకముగా గంగాజలముచేత లేదా ఆవుపాలు, కాకున్న కొబ్బరికాయ నీటితోనైనను- (ఇచ్చట 'గంగోదకైః' అని పాఠాంతరము కానవచ్చుచున్నది.)

శ్లో॥ సంతర్పయే త్పంచవారం పాత్రస్థం వర్ణ ముత్తమం
ఇదం తర్పణ మిత్యాహుః అష్టమీ సంస్క్రియా పరా॥

తా॥ పాత్రయందున్న (ఇట పత్రస్థం= ఆకునందున్న అని పాఠాంతరము) ఉత్తమమగు వర్ణములకు ఐదు పర్యాయ ములు తర్పణము గావించవలెను దీనినే ఎనిమిదవదియగు తర్పణ సంస్కారమందురు.

శ్లో॥ సందీపయే న్మహామంత్రం సమ్య జ్ఞిరాజనాధిభిః
లిఖితాక్షర మంత్రస్య సముచ్చారణ పూర్వకమ్
ఇదం దీపన మిత్యాహుః నవమీ సంస్క్రియా పరా ॥

తా॥ వ్రాసియున్న అక్షరములుకల మంత్రమునకు తన్మంత్రోచ్చారణ మొనర్చుచు నీరాజనాదులతో ప్రకాశి

మును కల్గించవలెను. ఇదియే తొమ్మిదవ సంస్కారమగు దీపన సంస్కారమనబడును.

శ్లో॥ సర్వదా గోపయే న్మంత్రం న దద్యా ద్యస్య కస్య చ
స్వయ మావర్తయే న్నిత్యం హనూమంత మనుస్మరన్ ॥
ఇమాం తు గుప్తి రిత్యాహు ర్దశమీ సంస్క్రియా పరా॥

తా॥ ఎల్లప్పుడు ఈ మంత్రమును రహస్యముగా నుంచవలెను. ఎవరికి పడితే వారి కీ మంత్రము నీయరాదు. హనుమంతుని స్మరించుచు ప్రతినిత్యము మంత్రమున కావృత్తి యొనర్చవలెను. దీనినే గుప్తి అనబడు పదియవ సంస్కారముగ చెప్పుదురు.

శ్లో॥ ఏవం సమస్తమంత్రాణాం కర్తవ్యా దశసంస్క్రియాః
అజప్తో గురుణా ప్యేవం దశసంస్కార సంస్కృతః
మహాప్రకాశతా మేతి శాణోల్లీఢ మణి ర్యథా ॥

తా॥ ఈ రీతిగా అన్ని మంత్రములకు ఈ దశ సంస్కారములను చేయవలెను. జపింపబడనిదైనను గురువుచే ఈ దశ సంస్కారములతో సంస్కరింపబడిన మంత్రము సాన పెట్టిన మణివలె గొప్ప ప్రకాశము నందును.

శ్లో॥ మంత్రస్యా ఽ ప్యుపదేశార్థః శిష్యాయ ప్రియవాదినే
శుభే దినే శుభే మాసే నక్షత్రే చ శుభే తథా
శుభే లగ్నే సితే పక్షే మంత్రం దద్యా ద్యథావిధి॥

తా॥ ఉపదేశకుడు మంత్రము నుపదేశించుట కర్హుడై మంచిమాటాడువానికి శుభదినమున, శుభమాసమున; శుభ

నక్షత్రమున, శుభలగ్నమున శుక్లపక్షమున యథావిధిగా మంత్రము నుపదేశించవలెను.

శ్లో॥ యావ న్నాఽ స్తగత శ్శుక్రః గురు ర్వా బృహతాం పతిః
తావదేవ గురు ర్దద్యా న్మంత్రం సూర్యోత్తరాయణే॥

తా॥ శుక్రమౌఢ్యమి కాని, గురుమౌఢ్యమి కాని లేకుండ చూచి ఉత్తరాయణమునందు గురువు శిష్యునకు మంత్రోపదేశము చేయవలెను.

శ్లో॥ శుభాం గ్రహగతిం వీక్ష్య ద్వయో శ్చ గురుశిష్యయోః
తదా మంత్రః ప్రదేయో వై పూర్వాహ్ణే శుభలక్షణే॥

తా॥ గురుశిష్యు లిర్వురకు గ్రహస్థితిని శుభప్రదముగ నుండునట్లుచూచి శుభలక్షణమైన ఉదయకాలమున శిష్యునకు మంత్రోపదేశము చేయవలెను.

శ్లో॥ యదా అర్ధోదయః పుణ్యః ప్రాప్యతే వా మహోదయః
చంద్రాదిత్య పరాగో వా గోవింద ద్వాదశీ యది॥

తా॥ ఎప్పుడైతే అర్ధోదయ పుణ్యకాలమగునో, లేక మహోదయ పుణ్యకాలమో, చంద్రగ్రహణముకాని, సూర్య గ్రహణముకాని వచ్చునో లేక గోవిందద్వాదశియగునో-

శ్లో॥ విషువం చాపి ప్రాప్తాయాం శివరాత్రౌ జయాతిథౌ
అవిచార్య తదా దేయః శిష్యస్య ప్రార్థనా యది॥

తా॥ పగలు, రాత్రియు సమమైయున్న రోజునకాని,

శివరాత్రినాడుకాని, జయ తిధులు అనగా తదియ, అష్టమి, త్రయోదశులందును శిష్యుడు ప్రార్థించియున్నచో వేరాలోచించక మంత్రమీయవలెను.

శ్లో॥ పుణ్యక్షేత్రే తథా తీర్థే యది స్యాత్సంగతి ర్ద్వయోః
సద్య ఏవ హి దాతవ్యా నాత్ర కార్యా విచారణా॥

తా॥ పుణ్యక్షేత్రమున కాని, పుణ్యతీర్థమునకాని, లేదా క్షేత్ర తీర్థములు రెండు నున్నచోట కాని గురు శిష్యులు కలసినయెడల వెంటనే అన్యమాలోచించక మంత్ర మీయ నగును.

శ్లో॥ న గణ్యతే గ్రహగతి ర్న వా శుక్రాది మూఢతా
నక్తం దివ విభాగో వా న వా వింధ్యాది దేశతా॥

తా॥ అట్టి చోటుల గ్రహగతినికాని, గురు శుక్ర మౌఢ్యమునికాని, రాత్రి పగలను భేదముకాని, వింధ్యాది ప్రదేశములని కాని గణింప నవసరములేదు.

శ్లో॥ స ఏవ యోగ్యకాల స్స్యాత్ పాత్రే మంత్రార్పణం యది
బహునాఽత్ర కి ముక్తేన శృణు మే నిశ్చితం వచః॥

తా॥ యోగ్యుడగు వానికి మంత్రమిచ్చు విషయమున లభ్యమైనదియే యోగ్యమైన సమయము. ఈ విషయమును గూర్చి పెక్కు రీతుల జెప్ప పనిలేదు. నిశ్చయమైన నా మాట వినుము.

శ్లో॥ భక్తి రేవాత్ర మూలం స్యాన్న వర్ణ కుల సంపదః
భక్తి ర్విదిత్వా భక్తస్య చిర ప్రణయనాదిభిః॥

తా॥ ఈ విషయమున భక్తియే ప్రధానము. వర్ణ కులములతో నిమిత్తములేదు. చిరకాల ప్రార్థనాదికము వలన భక్తునియొక్క భక్తిని తెలుసుకొని-

శ్లో॥ దంభాయ వా న దాతవ్యః న చ మత్సరిణే తథా
అనసూయాయ దాతవ్యః న వక్రగతయే తథా॥

తా॥ దాంభిక గుణము కలవానికి మంత్ర మీయ రాదు. మాత్సర్యగుణము కలవాని కీయరాదు. అసూయ కలవానికి మంత్ర మీయరాదు. అట్లే వంకర నడవడి కల వానికి మంత్ర మీయరాదు.

శ్లో॥ అతిమూఢాయ నో దేయః దేయో వినయశాలినే
శీలం విజ్ఞాయ చేష్టాభిః శుశ్రూషా ప్రణయాదిభిః
ప్రసన్నే యది చేత స్స్యా ద్దాతవ్య స్సద్యఏవ హి॥

తా॥ మిక్కిలి మూఢుడగు వానికి మంత్ర మీయ రాదు. వినయశాలియగు వానికి మంత్రమీయ నగును. శిష్యుని చేష్టాదికముచేతను, శుశ్రూష, నమ్రభావముల చేతను మనస్సు ప్రసన్నమైనచో వెంటనే మంత్రమీయ నగును.

శ్లో॥ చంద్రసూ ర్యోపరాగేషు మంత్రం నోపదిశే ద్బుధః
ప్రమాదా దథవా దద్యా ద్దారిద్ర్యం హనుమన్మనోః॥

తా॥ చంద్ర గ్రహణము, సూర్యగ్రహణములందు హనుమన్మంత్రమును విజ్ఞుడగువా డుపదేశించరాదు. ప్రమాద వశాత్తు అట్లిచ్చినచో దారిద్ర్యము సంభవించును.

శ్లో॥ శాబరాణాం తు మంత్రాణాం చంద్రసూర్యోపరాగయోః
ఉపదేశః ప్రశస్తస్స్యాన్నేతరేషాం కదాచన॥

శాబర మంత్రములను సూర్య చంద్ర గ్రహణములం దుపదేశించుట శ్రేష్ఠము. ఇతర మంత్రముల కెప్పుడును అట్టిది తగదు.

శ్లో॥ ఉపదేశే మహామంత్రాః నోపదేశ్యాః కదాచన
అన్యథోపదిశే న్మోహాత్ దారిద్ర్యం కోటిజన్మసు॥

తా॥ సూర్య చంద్ర గ్రహణములందు మహామంత్రముల నుపదేశింపరాదు. అజ్ఞాన వశమున అట్లుపదేశించినచో కోటి జన్మలయందు దారిద్ర్యము సంభవించును.

శ్లో॥ ఇతి నిగదిత మార్యవృత్తం తుభ్యం
సకల మతి స్వాయ మాంజనేయవృత్తం
అపి నిజరక్షణైవ దీక్షా
వశగత దివ్య మహానుభావః ॥

తా॥ అని ఓ మైత్రేయా ! అందరి మనసులయందు నున్న ఆంజనేయునియొక్క దివ్యచరిత్ర నీకు చెప్పబడినది. నిన్ను నీవు రక్షించుకొను రీతిగా ఈ దివ్యమగు హనుమ ద్విషయమును గుహ్యముగా రక్షింపవలసినది.

ఇతి శ్రీ పరాశరసంహితాయాం
పరాశర మైత్రేయ సంవాదే
పంచముఖ హనుమన్మంత్ర వివరణే
మంత్రసంస్కారకథనం నామ
సప్తపంచాశత్పటలః

## అష్టపంచాశ త్పటలః
# హనుమచ్చక్రధ్యానప్రకార కథనం

శ్రీ మైత్రేయః:-

శ్లో॥ అశేషాగమ సారజ్ఞ పరాశర మహామునే!
పంచాస్య హనుమత్స్వామి చక్ర ధ్యాన మనుత్తమమ్!
జ్ఞానాంకురం దృఢీకర్తుం వద మే కరుణానిధే,॥

తా॥ శ్రీ మైత్రేయులవా రడుగుచున్నారు. సమస్త వేదశాస్త్రముల సార మెరిగిన ఓ పరాశర మహామునీ! శ్రేష్ఠమైనదగు శ్రీ పంచముఖ హనుమచ్చక్ర ధ్యానమును దయామయుడవగు నీవు నా జ్ఞానాంకురములు దృఢముగ వృద్ధినందుటకై చెప్పవలసినది.

శ్రీ పరాశరః :-

శ్లో॥ సాధు పృష్టం మహాభాగ సత్కథా శ్రవణోత్సుక!
వక్ష్యే ధ్యానవిశేషాన్యై పంచాస్య హనుమత్ప్రభోః
యథా శ్రుతం మయా పూర్వాం గౌర్యై వర్ణాయతః శివాత్ ॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు. మంచి కథలు వినుటయందు ఉత్సాహము కల ఓ మహనీయా! నీవు చక్కగా అడిగితివి. పంచముఖ హనుమంతునియొక్క ధ్యాన విశేషాదులన్నిటిని శివుడు పార్వతికి చెప్పినట్లుగా నేను విని నంతవరకు చెప్పుచున్నాను.

శ్లో॥ కైలాసశిఖరే రమ్యే నానారత్న విభూషితే
మణిసింహాస నాసీనం గౌరీ ప్రపచ్ఛ శంకరమ్॥

తా॥ రమ్యమగు కైలాస శిఖరమున వివిధ రత్నములచే అలంకరింప బడియున్న ప్రదేశమున మణిమయమగు సింహాసనమునందు కూర్చొనియున్న శంకరుని పార్వతి ఇట్లడిగెను.

పార్వత్యువాచ:-

శ్లో॥ నిత్యధ్యాన నిరూఢాయ పంచవక్త్ర హనూమతః
ధ్యానం చక్రస్థ మస్మాకం వక్తవ్యం పరమేశ్వర!॥

తా॥ పార్వతీదేవి ఇట్లనెను. ఓ పరమేశ్వరా! పంచముఖ హనుమంతునియందు ఎల్లవేళల ధ్యానము నిల్చుటకై అట్టి హనుమచ్చక్ర ధ్యానమును మాకు చెప్పవలసినది.

ఈశ్వర ఉవాచ:-

శ్లో॥ సమ్యక్పృష్టం త్వయా దేవి! మన్మనో రథ పూర్తిదం
పంచాస్య హనుమ చ్చక్ర ధ్యానం సాంగం బ్రవీమి తే॥

తా॥ ఈశ్వరుడు ఇట్లు పల్కెను. ఓ దేవీ! నా కోర్కె నెరవేరునట్లుగా నీవు చక్కగా అడిగితివి. అంగసహితముగ పంచముఖ హనుమచ్చక్ర ధ్యానమును నీకు చెప్పుచున్నాను.

శ్లో॥ సంశ్రుణు ష్వైకచిత్తేన గుహ్యామాముష్మికం పరం
మధ్యమే చక్రరాజస్య నాభ్యా మమృతసాగరమ్॥

తా॥ అతిరహస్యమును, మోక్షదాయకమును అగు దీనిని నిశ్చలమగు మనస్సుతో వినుము. హనుమచ్చక్ర రాజముయొక్క మధ్యమమున నాభి ప్రదేశమున అమృత సాగరమును

శ్లో॥ ధ్యాత్వా తన్మధ్యమే శ్వేతద్వీపం సంచింతయే త్ప్రియో
తన్మధ్యే స్వర్ణకదళీ కాంతారం సమచింతయేత్॥

తా॥ ధ్యానించి, దానిమధ్యభాగమున శ్వేతద్వీపమును చక్కగ భావన చేయవలెను. ఆ శ్వేతద్వీప మధ్య భాగమున బంగారు అరటితోటను భావన చేయవలెను.

శ్లో॥ తన్మధ్యమే మహారమ్య ప్రాసాదం మణిరంజితం
తన్మధ్యే రత్నఖచిత స్వర్ణసింహాసనోత్తమే॥

తా॥ ఆ అరటితోట మధ్య మిక్కిలి రమ్యమైన మణులచే ప్రకాశించు భవనమును, ఆ భవన మధ్యమున ఉత్తమమగు రత్నఖచిత స్వర్ణ సింహాసనమున

శ్లో॥ పద్మాసనే సమాసీనం స్వర్ణాలంకార భూషితం
బాలార్కకోటి ప్రతిమం విద్యు ద్వర్ణాంబ రావృతమ్॥

తా॥ పద్మాసనమున కూర్చొన్న వానిని, బంగారు ఆభరణములచే నలంకరింపబడిన వానిని కోటి బాలభానుల కాంతికల రూపముదాల్చిన వానిని, మెఱుపువలె ప్రకాశించు వస్త్రములు ధరించినవానిని

శ్లో॥ పంచవక్త్రం త్రిపంచాక్షం దశబాహు సమన్వితం
ఖడ్గాంకుశ త్రిశూ లాక్షమాలా పర్వత భూరుహామ్॥

తా॥ ఐదుముఖములు కలవానిని, పదునైదు నేత్ర ములు కలవానిని, పదిచేతులు కలవానిని, ఖడ్గము, అంకు శము, త్రిశూలము, అక్షమాల, పర్వతము, వృక్షము,

శ్లో॥ పాశ సంజీవనీ చీర టంకా ధారణ మద్భుతం
ఇందుఖండావతం సోత్తమాంగ ముత్తుంగ విగ్రహమ్॥

తా॥ పాశము, సంజీవని, చీరము, టంకాయుధము లను ధరించి అద్భుతముగ నున్నవానిని, చంద్రశేఖ శిరో భూషణముగాకలశిరస్సు కలవానిని, ఎత్తయిన విగ్రహము కలవానిని,

శ్లో॥ గండ మండల విభ్రాజ ద్రత్నకీలిత కుండలం
దశదిగ్భ్రాజితోదగ్ర కిరీటేన విరాజితమ్॥

తా॥ రత్నములు పొదగిన కుండలములు చెక్కిలి ప్రదేశమున ప్రకాశించువానిని, దశదిశల కాంతినింపు గొప్ప కిరీటముతో ప్రకాశించువానిని,

శ్లో॥ హార కంకణ కేయూర కాంచీవలయ శోభితం
మణి స్వర్ణమయాఽనేక భూషణస్ఫూర్తి భాసురమ్॥

తా॥ మెడయందు హారములు, చేతికి కంకణములు, బుజములందు కేయూరములు, కటిభాగమున మొలనూలు ప్రకాశించువానిని, మణులు పొదిగి బంగారముతో చేయ బడిన అనేక ఆభరణములతో ప్రకాశించువానిని,

శ్లో॥ సర్వాంగసుందరం దివ్యమూర్తిం జ్ఞానామృతాకరం
సేవకాయ సమాసీనం భక్తాభీష్ట ఫలప్రదమ్॥

తా॥ సర్వాంగసుందరుడైనవానిని, దివ్యమగు విగ్రహము కలవానిని, జ్ఞానమను అమృతమునకు నిలయమైన వానిని, సేవకులకై నిరీక్షించి యుండువానిని, భక్తులుకోరిన ఫలము లందించువానిని

శ్లో॥ శరణ్యం సర్వదేవానాం త్రాతారం భక్తవత్సలం
సర్వకామద మింద్రాది సర్వదైవై రుపాసితమ్॥

తా॥ సర్వ దేవతలకు శరణ్యుడైన వానిని, భక్తుల యందు వాత్సల్యముకలవానిని రక్షకుడగువానిని, సమస్తము లైన కోర్కెలు తీర్చువానిని, ఇంద్రాది సర్వదేవతలచే నుపాసింపబడు వానిని

శ్లో॥ శివబీజాక్ష రైకస్థం పంచాస్యం పవనాత్మజం
త్రిభాగసంవృతై రేభి స్త్రిమూర్తిభి రహర్నిశమ్॥

తా॥ శివ బీజాక్షర మొక్కదానియందే ఉండువానిని, పంచముఖములు కలవానిని, వాయునందనుని, అహర్నిశల మూడుభాగములందు ఆవరించిన త్రిమూర్తులు కలవానిని,

శ్లో॥ అపారాఽవ్యక్త చిన్మూర్తిం భవిష్య త్పంకజాసనం
యోగపద్మాసనాసీనం మహాయోగీశ్వరం హరిమ్॥

తా॥ అనంతము, అవ్యక్తము అగు జ్ఞానస్వరూపుని, భవిష్యద్బ్రహ్మను, యోగపద్మాసనమున కూర్చునియున్న వానిని, మహాయోగియగు వానిని, కపీంద్రుని-

శ్లో॥ నృసింహ తార్క్ష్య వారాహ హయగ్రీవై స్సమావృతం
షడ్భి స్సుదర్శనై ర్వ్యక్త లక్షణై స్సమ్యగావృతమ్॥

తా॥ నారసింహ, గరుడ, వరాహ, హయముఖము లతో కూడిన వానరేశ్వరుని, సుదర్శనాదులగు ఆరు వ్యక్త లక్షణములతో కూడియున్న వానిని,

శ్లో॥ శివ రా మేందు మార్తాండై ర్దిగ్దశా ద్వాదశాలయైః
అవస్థితైః స్థిరై స్సమ్యక్సంవృతం పరమేశ్వరమ్ ॥

తా॥ శివ, రామ, చంద్ర, సూర్యులతో, దశదిశల ద్వాదశాలయములతో స్థిరముగ ఉనికిగల వారితో కూడి యుండు పరమేశ్వరుని,

శ్లో॥ సూర్య రుద్ర వసు బ్రహ్మ విశ్వేదేవై ర్నిరంతరం
సంవృతం షోడశై ర్వ్యక్త స్సర్వాభి శ్శక్తిభిః పృథక్ ॥

తా॥ ద్వాదశాదిత్య, ఏకాదశరుద్ర, అష్టవసు, బ్రహ్మ, విశ్వేదేవతలచేత ఎల్లప్పుడు కూడియుండువానిని సమస్తములగు పదనారు శక్తులతోను కూడి ప్రత్యేకముగ నుండువానిని,

శ్లో॥ క్షేత్రపాలై ర్వింశభి ర్వటుకాద్యై రలంకృతం
సేవితం చైవ తత్త్వాభి శ్ఛందోభి ర్వివిధై రపి ॥

తా॥ ఇరువది క్షేత్రపాలురు వటుకాదులతో అలంకృతుడగు వాడును, సర్వతత్త్వములతోను వివిధ ఛందస్సుల తోను సేవింపబడు వానిని,

శ్లో॥ ద్వాత్రింశద్భి ర్నృసింహైశ్చ సమ్యక్సంవేష్టితం పునః
యోగినీ భైరవైశ్చాపి చతుష్షష్ట్యనిలాత్మజైః ॥

తా॥ ముప్పదిరెండు నృసింహ రూపములతో చక్కగా పరివేష్టింపబడువాడును, యోగినీగణములతోను, భైరవగణములతోను, అరువదినాలుగు వాయుజ రూపముల తోను-

శ్లో॥ సంవేష్టితం చైవ మేవ మహాచక్రస్థ ముత్తమం
సర్వావతారకం దివ్య తేజోమూర్తిం నిరీశ్వరమ్ ॥

తా॥ పరివేష్టింపబడు వానిని, ఇట్లే మహాచక్రస్థుడై యున్న ఉత్తముడగువానిని, సర్వావతారకుని, దివ్య తేజస్సునుదాల్చిన రూపము కలవానిని, నిర్గుణస్వరూపుని,

శ్లో॥ ఏవం పంచాననం వాయుసూనుం ధ్యాయే దనన్యధీః
తతః కృపాకర స్తస్య సర్వాపదోభ్యో విముచ్యతే ॥

తా॥ ఇట్టి పంచముఖుడు, వాయుకుమారుడు అగు హనుమంతుని అనన్య మనస్కుడై ధ్యానింపవలెను. అంత దయామయుడగు హనుమంతుడట్లు ధ్యానించిన భక్తుని సమస్తములగు ఆపదలనుండి విముక్తుని చేయును.

శ్లో॥ జిత్వాఽథ దారుణం మృత్యుమ్మృత్యుగ్రం కాలసంజ్ఞకం
ఐహికాముష్మికా న్భోగా న్ప్రాప్నో త్యవ్యాహతా నరః॥

తా॥ పిమ్మట అట్టి ధ్యానమొనర్చిన నరుడు మిక్కిలి భయంకరము, దారుణము అయి కాలుడను పేరుగల మృత్యు

వును జయించి ఎదురులేని వాడై ఇహ. పర భోగముల ననుభవించును.

శ్లో॥ య ఇదం పరమం గుహ్యం పంచాస్య హనుమత్ప్రభోః
ధ్యానం పఠ త్యనుదినం త ధైక్యత్వ మవాప్నుయాత్॥

తా॥ ఎవరైతే ఈ పరమ రహస్యమగు పంచముఖ హనును ధ్యానమును ప్రతిదినము పఠింతురో వారా హనుమంతునితో తాదాత్మ్య మందుదురు.

శ్లో॥ కథాంతరం ప్రవక్ష్యామి మైత్రేయ! శృణు తత్త్వతః
హనుమత్పూజ నాదౌ చ పూజాంతే ప్రత్యహం సుధీః॥

తా॥ ఓ మైత్రేయా! వేరొక విషయమును చెప్పుచున్నాను. ధ్యానముతో వినవలసినది. విజ్ఞుడగువాడు ప్రతి దినము హనుమత్పూజకు ముందును, పూజయైన తర్వాతను,

శ్లో॥ సాష్టాంగం చ నమస్కుర్యా త్పంచవారం హనూమతః
త్రికాల మేకకాలం వా కాలద్వయ మథాఽపి వా ॥

తా॥ హనుమంతునకు ఐదుమార్లు సాష్టాంగ నమస్కారములు చేయవలెను. మూడు ప్రొద్దులందుకాని, రెండు పూటలుకాని లేదా ఒక్కపూట అయినను,

శ్లో॥ మూలమంత్రం జపే న్నిత్యం గురుపూజా పరాయణః
బహునాత్ర కి ముక్తేన హనూమ న్మంత్రతత్పరః ॥

తా॥ గురుపూజా పరాయణుడై ప్రతినిత్యము మూల మంత్రమును జపించవలెను. ఈ విషయమున పెక్కుమాట లేల? హనుమన్మంత్ర తత్పరుడై -

శ్లో॥ యావజ్జీవం నయేత్కాలం మనో వాక్కాయ కర్మభిః
ఏవం నయతి యః కాలం మంత్రవి న్మంత్రతత్పరః ॥

తా॥ యావజ్జీవిత కాలమును గడుపవలెను. మనో వాక్కాయ కర్మల త్రికరణ శుద్ధిగ మంత్ర తత్పరుడై ఏ మంత్రజ్ఞుడగువాడు ఇట్లు కాలము గడుపునో-

శ్లో॥ స ఏవ హనుమా న్బ్రహ్మ న్నాత్ర కార్యా విచరణా॥

తా॥ ఆతడు సాక్షాత్తు హనుమంతుడే యగుచున్నాడు. ఓ బ్రాహ్మణోత్తమా! ఇందు సందేహింప పనిలేదు.

శ్లో॥ భూత ప్రేత పిశాచానా ముచ్చాటనవిధిం మునే!
వక్ష్యా మ్యహం ప్రయత్నేన లోకానా ముపకారకమ్ ॥

తా॥ ఓ మైత్రేయ మహామునీ! లోకముల కుపకారకమైన భూత, ప్రేత, పిశాచాదుల యుచ్చాటన విధానమును ప్రయత్నపూర్వకముగ చెప్పుచున్నాను.

శ్లో॥ భూత ప్రేత పిశాచానా మాత్యయో యత్ర దృశ్యతే
తత్రాభిముఖ మాస్థాయ శ్రీవీరహనుమ న్మనుం
పంచవారం జపం కుర్యా ద్ధనూమ న్ముద్రణం తథా ॥

తా। భూత, ప్రేత, పిశాచముల ప్రమాద మెచ్చట నుండునో ఆ తావున కభిముఖుడై కూర్చొని శ్రీ వీర హనుమన్మంత్రమును ఐదు పర్యాయములు జపించవలెను. ఆస్థ హనుమన్ముద్రను వేయవలెను.

శ్లో॥ ఏవం కృతే మంత్రవిధౌ మంత్రస్యాఽఽవృత్తి పూర్వకం
పలాయంతే మహాభీతా భూత భేతాళ రాక్షసాః ॥

తా॥ ఈ రీతిగా మంత్రావృత్తి పూర్వకముగా మంత్రి విధి నొనర్చినచో భూతభేతాళ రాక్షసాదులన్నియు మిక్కిలి భయమంది పారిపోవును.

శ్లో॥ ఇత్యాహనంతి మునయో యథాశ్రుత ముదాహృతం
ముద్రాయా లక్షణం వక్ష్యే శృణు ష్వానన్యమానసః ॥

తా॥ అని మునులు చెప్పుచున్నారు. నేను వినిన రీతిగా నీకు తెలియజేసినాను. ఇక హనుమన్ముద్రా లక్షణమును చెప్పుచున్నాను. అనన్య మనస్కుడవై వినవలసినది.

శ్లో॥ యస్యా శ్శ్రవణ మాత్రేణ పిశాచో బిభ్యతి స్వయం
కిల్కిలి ప్రచురం సద్యః బూ బూ కారం సముచ్చరన్॥

తా॥ ఈ యంత్రమును గూర్చి విన్న మాత్రముననే పిశాచములు తమంతట భయపడిపోవును. కిలికిలి శబ్దము చేయుచు వెంటనే బూబూ అనుశబ్దము నుచ్చరించుచు-

శ్లో॥ విధృత శ్రవణే నేత్రే ప్రహస్య పురతో ముఖం
తాలూన్యాపూర్య ఫూత్కారై ర్విష్టభ్య భువి జానునీ ॥

తా॥ చెవులను, కండ్లను విస్ఫుష్టముల నొనర్చి ముఖమును ముందుకు చేర్చి అట్టహాసము చేయుచు దవుడలను వాయువుతో నింపి ఫూత్కార మొనర్చుచు, మోకాళ్ళను భూమిపై ఆనించుచు-

శ్లో॥ మధ్యమాఽనామికాఽంగుష్ఠ దృఢ సంయోగ పూర్వకం
ఉత్క్షిప్య బాహుమధ్యాహో సమ కర్ణాంత గామినో॥

తా॥ మధ్య వేలు, ఉంగరపు వేలు, చిటికెన వేలు గట్టిగా కలిపి చెవులకు సమానముగ పోవునట్లు చేయుట పైకెత్తి,

శ్లో॥ భూత ప్రేతాది సంస్థానం భీకరం ప్రతిలోకయేత్
సైషా తు హనుమన్ముద్రా కథితా మంత్రవిత్తమైః
భూత ప్రేత పిశాచానాం మహతీయం బిభీషికా ॥

తా॥ భూత ప్రేతాదులున్న తావును భయంకరముగ చూడవలెను. ఇట్లు చేయుటయే మంత్రవేత్తలచేత హనుమన్ముద్రగా చెప్పబడినది ఈ హనుమన్ముద్ర భూత ప్రేత పిశాచాదులకు మిక్కిలి భయమును కల్గించునది.

శ్లో॥ ఉదగ్ర వాల భ్రమణానిలాహతా
రయేణ య స్యాంబుధరా స్సమంతతః
స దివ్య పంచానన వాయునందనో
మ నూస్తు కల్యాణవివృద్ధయే హరిః ॥

తా॥ ఏ మహాసీయుని వాలభ్రమణము వలన పుట్టినడీన వాయువుచే వేగముగ మేఘములు నలుదిక్కుల కొట్టబడుచున్నదో అట్టి దివ్యుడు, పంచాననుడు అగు వాయుపుత్రుడు హనుమంతుడు నాకు మంగళవృద్ధికరుడగుగాక!

ఇతి శ్రీ పరాశర సంహితాయాం
పరాశర మైత్రేయసంవాదే
పంచముఖ హనుమన్మహామంత్ర వివరణే
హనుమచ్ఛక్తిధ్యానప్రకార కథనంనామ
అష్టపంచాశ త్పటలః

# ఏకోన షష్టితమః పటలః

## ఆంజనేయ శ్రీ విద్యా

## మంత్రాణాం జాతాశౌచమృతాశౌచ లక్షణం

శ్రీ పరాశరః:-

శ్లో॥ నమ స్సుమణికుండలం నయనపుష్పవ న్మండలం
హృది ప్రణత వాతాంజలిం శ్రిత సురాసురేంద్రాంజలిన్॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు. మంచి మణులు పొదిగిన కుండలములు కలవాడు, పుష్పము వలె సుందరమైన కన్నులు కలవాడు అగు హనుమంతునకు నమస్కరించుచున్నాను వాయుసుతుడు దేవ దేవాదులచే నమస్కరింపబడి ఆశ్రయుడగు హనుమంతునకు హృదయమున నమస్కారము లొనర్చుచున్నాను.

శ్లో॥ సహార మణిభూషణం సరస భక్త సంతోషణం
హనూమ దభిధం హరం హరిం విరించిసేవ్యం భజే॥

తా॥ హారములతోడి మణిభూషణములు కలవానిని, సరసులగు భక్తులను సంతోషపరచువానిని, హనుమంతుడను పేరుకలవానిని, శివస్వరూపుని, విష్ణుస్వరూపుని, బ్రహ్మచే సేవింపబడు వానిని నేను భజించుచున్నాను.

శ్లో॥ సీతా రాఘవ దత్త మౌక్తిక లస ద్ధారావలీ శోభితం
హస్తాంభోజ వరాభ యాంకిత మనేకాకల్ప రత్నోజ్జ్వలం
వాలా వేష్టిత మౌళి మీశ్వరతనుం భక్తానుకల్పద్రుమం
రాజ న్మౌంజ్యజినోపవీత మనిశం శ్రీఆంజనేయం భజే॥

తా॥ సీతారాములచే ఈయబడిన ముత్యముల హారములతో ప్రకాశించువానిని, కరపద్మములతో వరద అభయ ముద్ర వహించియుండువానిని, అనేక రత్నములతో ప్రకాశించువానిని, తోకతో చుట్టబడిన కిరీటము కలవాడును, ఈశ్వర స్వరూపుడును, భక్తులకు కల్పవృక్షమువంటి వాడును ప్రకాశించెడి మౌంజి, అజినము, జందెములు కలవాడును అగు శ్రీ ఆంజనేయుని ఎల్లప్పుడు సేవింతును.

శ్లో॥ అన్యం విశేషం వక్ష్యామి సర్వలోకోపకారకం
యస్య శ్రవణమాత్రేణ మంత్రసిద్ధి ర్భవిష్యతి ॥

తా॥ సమస్త లోకములకు ఉపకారము కల్గించునట్టి వేరొక విశేషమును తెల్పుచున్నాను. దీనిని వినినంత మాత్రమున మంత్రసిద్ధి కాగలదు.

శ్లో॥ సర్వేషా మేవ మంత్రాణాం సంస్మృతం సూతక ద్వయం
జాతసూతక మాద్యం చ ద్వితీయం మృతసూతకమ్॥

తా॥ అన్ని మంత్రములకును రెండు సూతకములు చెప్పబడినవి. మొదటిది జాతసూతకము, రెండవది మృత సూతకము

శ్లో॥ జాతసూతక మి త్యాహుః మంత్రోచ్చారణ సంభవం
మంత్రాక్ష రోపసంహారా దాహు స్తం మృతసూతకమ్॥

తా॥ మంత్రోచ్చారణమున కల్గునది జాతసూతక

మనబడును. మంత్రాక్షరముల నుప సంహరించుట వలన ఏర్పడునది మృతసూతకమనబడును.

శ్లో॥ సూతకద్వయ దుష్టానాం మంత్రాణాం జపతా మపి
సిద్ధి ర్న దృశ్యతే క్వాపి ప్రయాసో ఽపి మహా న్భవేత్॥

తా॥ జాతాశౌచ మృతాశౌచ దుష్టములగుమంత్రములను జపించుటవలన మంత్రసిద్ధి యెచ్చటనుకల్గదు. కేవలం ప్రయాస మాత్రమే మిక్కిలి కల్గును.

శ్లో॥ జపాదా సూతకం విద్యా జ్జపాంతే మృతసూతకం
ఉభయో స్సూతకం విద్యా త్తజ్జపం నిష్ఫలం భవేత్॥

తా॥ జపాదినే సూతకము నెరుగవలెను. జపాంతమున మృతసూతక మగును. రెండుసూతకముల యందును చేయు జపము నిష్ఫలమని తెలియదగును.

శ్లో॥ అత స్సముద్ధరే న్మంత్రం సూతకద్వయ కర్దమాత్
బిందుయుక్తం సముచ్చార్య పంచాశ ద్వర్ణ మాలికామ్॥

తా॥ అందుచే మంత్రమును సూతక ద్వయమను బురదనుండి ఉద్ధరింపవలెను. ఆవిధానమే మన ఏబది యక్షరములుకల అక్షరమాలికను బిందువును చేర్చి యుచ్చరించి

శ్లో॥ అనులోమక్రమే ణైవ నిహన్యా జ్జాత సూతకం
భూయోపి తాం సముచ్చార్య విలోమే నైవ మాలికామ్॥

తా॥ అనులోమ క్రమముతో జాతా శౌచమును పోగొట్టవలెను. మరల విలోమ క్రమముతో వర్ణమాలికనుచ్చరించి

శ్లో॥ మాంత్రికో మంత్రరాజస్య నిహన్యాన్మృతసూతకం
న చే జ్జప్తోఽపి తన్మంత్రః క్లీబ స్సన్నైవ సిద్ధిదః

తా॥ మాంత్రికుడగు వాడు మంత్రరాజముయొక్క మృతసూతకమును పోగొట్టవలెను. అట్లు కాకున్నచో ఆ మంత్రము జపించినను నపుంసకసమమై ఫలితము నీయజాలదు.

శ్లో॥ అనేన విధినా సమ్యక్ జప్త్వా చ మంత్ర ముత్తమం
పరాం సిద్ధి మవాప్నోతి సుప్రీతో హనుమాన్ భవేత్

తా॥ ఈ విధానముతో ఉత్తమమగు మంత్రమును బాగుగా జపించి మంత్రవేత్త గొప్పగ మంత్రసిద్ధినందును. హనుమంతుడును సుప్రీతుడగును.

శ్లో॥ ఏవం సందిశ్య భగవా న్పరాశరముని స్తదా
పునః ప్రోవాచ మైత్రేయం సర్వేషాం హితకామ్యయా॥

తా॥ ఈ రీతిగా మహానుభావుడగు పరాశరముని ఉపదేశ మొనర్చి అప్పుడు జనులందరకు మేలు చేయగోరి మైత్రేయునితో మరల నిట్లనెను.

శ్లో॥ మైత్రేయ! శృణు వృత్తాంతం సర్వలోకోప కారకం
మంత్రా స్తు బహవ స్సన్తి సర్వకామ ఫలప్రదాః ॥

తా॥ ఓ మైత్రేయా! సర్వలోకోపకారమగు ఈ వృత్తాంతము వినుము. సర్వ విధముల కోర్కెలు తీర్చు మంత్రము లనేకము లు కలవు.

శ్లో॥ శాక్తేయా గారుడా శ్శైవ వైష్ణవా శ్చ సముత్తమా
గాణాపత్యా స్తు కౌమారాః కౌబేరా భైరవా స్తథాః॥

తా॥ శక్తి సంబంధములైనవి, గరుడ సంబంధములైనవి, విష్ణు సంబంధములైనవి, ఉత్తమములైన గణపతి సంబంధమైనవి, కుమార సంబంధమైనవి, కుబేరమంత్రములు అట్లే భైరవమంత్రములు అనేకములుకలవు.

శ్లో॥ తత్త త్ఫలప్రదా నిత్యం సౌమ్య! సౌమ్యవిభాగతః
కింతు సర్వే మహామంత్రాః నానావిధ ఫలప్రదాః॥

తా॥ సౌమ్యుడవగు ఓ మైత్రేయా! ఇందు సౌమ్య విభాగము ననుసరించి ఆ యా ఫలములు నిత్యమిడునట్టివి; కాని, సమస్తములగు మహామంత్రములును నానావిధములగు ఫలితము లొసంగునవిగా నున్నవి.

శ్లో॥ అస్తి కశ్చి న్మహామంత్రః సప్తమంత్రాత్మికః శ్శుభః
నాయక స్తస్య హనుమాన్ పంచవక్త్రో మహాప్రభుః॥

తా॥ సప్త మంత్రాత్మిక మను ఒక శుభకరమగు మహామంత్రము కలదు. దానికి పంచముఖుడు, మహా సమర్థుడు నగు హనుమంతుడు నాయకుడు.

శ్లో॥ అంగభూతా హి మంత్రాస్తే సప్తమంత్ర మహామనోః
అంగ ప్రధాన భావేన జప్త్వా చ మంత్ర ముత్తమమ్।

తా॥ ఆ మంత్రము లన్నియును సప్తమంత్ర మహా మనువుకు అంగభూతములే. ఉత్తమమగు మంత్రమును అంగ భావముతోను, ప్రధాన భావముతోను జపించి

శ్లో॥ లేభిరే పరమాం సిద్ధిం శౌనకాద్యా మహర్షయః
త్వమ ప్యేవం మహాప్రాజ్ఞ! మైత్రేయ! మునిసత్తమ!॥

తా॥ శౌనకాది మహామునులందఱును ఉత్తమమగు సిద్ధినిపొందిరి. ఓ మహాప్రాజ్ఞుడా! మునిశ్రేష్ఠుడా! మైత్రేయా నీవుకూడ ఈరీతిగా

శ్లో॥ సప్త మంత్రాత్మికాం విద్యాం వరస్వ సతతం శుభాం
సుప్రీతో హనుమాన్ సద్యః భుక్తిం ముక్తిం ప్రదాస్యతి।

తా॥ శుభప్రదమగు సప్త మంత్రాత్మిక విద్య నెల్లప్పుడు పఠింపుము. వెంటనే హనుమంతుడుసంతుష్టుడై భుక్తిని, ముక్తిని ప్రసాదించగలడు

శ్లో॥ అన్య ద్రహస్యం వక్ష్యామి మైత్రేయ! మునిపుంగవ!
గోపనీయం ప్రయత్నేన సర్వదాఽభిమతా త్వయా॥

తా॥ ఓ మునిశ్రేష్ఠా! మైత్రేయా! వేఱొక విశేషమును చెప్పుచున్నాను విని నిష్టుడవగు నీవెల్లప్పుడు దీనిని ప్రయత్న పూర్వకముగా రహస్యముగ నుంచవలెను.

శ్లో॥ మంత్రాస్తుబహవో బ్రహ్మన్ మయా యేసముదాహృతాః
తే సర్వే హనుమన్మంత్రాః భుక్తి ముక్తి ఫలప్రదాః
కిం తుమంత్రాన్వయం సమ్యగ్వర్తతే సర్వతోముఖమ్।

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా! నాచే చెప్పబడు ఏ యెక్కుడు మంత్రము లేవైతే యున్నవో అవియన్నియు హనుమన్మంత్రములును భుక్తిని, ముక్తిని ఈయగలవి. కాని సర్వతోముఖముగ మంత్రాన్వయము కలదు.

శ్లో॥ ఆదౌ ప్రణవ ముచ్చార్య శ్రీం బీజం తదనంతరం
తతో మన్మథబీజం చ శ్రీవర్ణం తదనంతరమ్॥

తా॥ మొదట ప్రణవము నుచ్చరించి అనంతరము శ్రీం బీజము నుంచవలెను. ఆపై క్లీం అను మన్మథబీజమును, పిదప శ్రీవర్ణమును.

శ్లో॥ తత శ్శుభాంగశబ్దం చ చతుర్థ్యంతం నమోంతకం
దశవర్ణమయీ మేవం శ్రీవిద్యా ముత్తమాం శుభాం
జపే దేషా గుణవతీ సర్వకామ ఫలప్రదా॥

తా॥ పిదప శుభాంగ శబ్దమును చతుర్థ్యంతముగా అనగా శుభాంగాయ అని నమః అనునది చివర చెప్పవలెను. ఇట్టి శుభప్రదమగు, ఉత్తమమగు, పది అక్షరములు కల దగు, శ్రీవిద్యను జపించవలెను. ఈ మంత్రము మంచి గుణములు కలదియు, కోరినకోర్కె లన్నిటి నొసగునదియును.

శ్లో॥ అత ఏనాం మహావిద్యాం శ్రీకామో నియతం జపేత్
నిశీథే శీఘ్రఫలదాం ప్రదోషేషు విశేషతః॥

తా॥ అందుచే ఈ మహావిద్యను సంపదలు కోరువాడు నియతముగ జపింపవలెను. ఇది రాత్రివేళల జపించుట వలన శీఘ్రముగ ఫలితమిచ్చును. ప్రదోష సమయమున నైనచో విశేషించి ఫలప్రదమగును.

శ్లో॥ ఆదౌ ప్రణవ ముచ్చార్య శ్రీంబీజం తదనంతరం
తతో మన్మథబీజం చ సముచ్చార్య ప్రయత్నతః॥

తా॥ ముందుగా ఓంకారము నుచ్చరించి అనంతరము శ్రీం అనిచెప్పి పిమ్మట మన్మథ బీజమగు క్లీం అని ప్రియత్న పూర్వకముగ నుచ్చరించి

శ్లో॥ శ్వేతవర్ణపదం సమ్య క్చతుర్థ్యంతం నమోంతకం
దశవర్ణాత్మకం మంత్రం మోక్షార్థీ సతతం జపేత్॥

తా॥ చతుర్థ్యంతముగా శ్వేతవర్ణపదమునుంచి అనగా శ్వేతవర్ణాయ అని చెప్పి చివర నమః అనవలెను. ఇది పది యక్షరముల మంత్రము. మోక్షార్థియగు వాడెప్పుడు దీనిని జపించవలెను.

శ్లో॥ ఏషా విద్యా తు విప్రేంద్ర! కైవల్యపద దాయినీ
మధ్యాహ్నే చ ప్రభాతే వా జపే చ్ఛీఘ్ర ఫలప్రదామ్॥

తా॥ ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! ఈ మంత్రము మోక్షపద మిచ్చునది. మధ్యాహ్నమందు, ప్రభాతసమయమునను ఇది శీఘ్రఫలము నిచ్చును కాన అప్పుడు జపించవలెను.

శ్లో॥ శ్రీవిద్యయో ర్ద్వయో ర్బ్రహ్మాన్ ఋషిర్బ్రహ్మ ప్రకీర్తితః
గాయత్రీ వేదజననీ సాక్షా చ్ఛందో నిగద్యతే॥

తా॥ ఓ విప్రవరుడా! ఈ రెండు శ్రీవిద్యలకును బ్రహ్మ ఋషిగా చెప్పబడుచున్నాడు. వేద మాతయగు సాక్షాత్ గాయత్రియే ఛందస్సుగా చెప్పబడుచున్నది.

శ్లో॥ హనుమాన్ దేవతా ప్రోక్తః ప్రణవో బీజ ముచ్యతే
నమ శ్శక్తి రితి ప్రోక్తా కీలకం శ్రీ ర్నిగద్యతే॥

తా॥ ఈ మంత్రమునకు హనుమాన్ దేవత. ఓం బీజముగా చెప్పబడుచున్నది నమః శక్తిగా చెప్పబడినది. శ్రీః కీలకంగా చెప్పబడుచున్నది.

ధ్యానం:-

శ్లో॥ శ్రీవిద్యామయ మాంజనేయ మనిశం ధ్యాయామిచిత్తేముదా
ముక్తాహార విరాజమాన విపుల శ్రీకంఠ వక్షస్థలం
భక్తానా మభయ ప్రదాన చతురం చిత్రాంబ రాలంకృతం
హేమాంభోజ సమాన కాంతి వదనం శ్రీ పార్వతీనందనమ్॥

తా॥ శ్రీవిద్యా స్వరూపుడు, ముత్యాలహారముతో విరాజమానమగు విశాలమగు శోభాయమానమగు కంఠము, వక్షస్థలము కలవాడును, భక్తులకు అభయమిడుటలో నేర్పరియు, చిత్ర విచిత్రములగు వస్త్రముల నలంకరించుకొను వాడును, బంగరు పద్మముతో సమానమగు కాంతి గల ముఖము కలవాడును, పార్వతీ నందనుడును అగు ఆంజనేయు నెల్లప్పుడు మనస్సునందు ధ్యానించుచున్నాను.

శ్లో॥ ఏవం ధ్యాత్వా జపేన్మంత్రం ప్రత్యహం మంత్రసాధకః
ప్రసాదా ద్వాయుపుత్రస్య మంత్రసిద్ధి మవాప్నుయాత్॥

తా॥ ఇట్లు ధ్యానించి మంత్రసాధకుడగు వాడు ప్రతి రోజు మంత్రమును జపించవలెను. అట్లు జపించినయెడల వాయు నందనుడగు హనుమంతుని యనుగ్రహము వలన మంత్రసిద్ధి పొందగల్గును.

శ్లో॥ శ్రీవిద్యే తే ఉభే విద్యే యథా శుక ముదాహృతే
గోపనీయే ప్రయత్నేన మంత్రసార మిదం యతః॥

తా॥ శ్రీవిద్యలను ఈ రెండు మంత్రములు తెలిసికొనిన పద్ధతిలో చెప్పితిని. ప్రయత్న పూర్వకముగ వీనిని రహస్యముగ నుంచవలెను. ఏలనన ఇదియే మంత్రసారము.

శ్లో॥ ఇదం మంత్రద్వయం ధీమన్! శ్రీవిద్యేతి నిగద్యతే
ఇమౌ శ్రీహనుమ న్మంత్రౌ ఇతి సంగీయతే బుధైః॥

తా॥ ఓ బుద్ధిమంతుడా! ఈమంత్రములు రెండుకలసి శ్రీవిద్యయని చెప్పబడుచున్నవి. ఇవి రెండును హనుమన్మంత్రములుగా పండితులచే విశేషముగకొనియాడ బడుచున్నవి.

శ్లో॥ తత్త త్ఫలప్రదానేన తత్త త్సంజ్ఞావిశేషభాక్
ఇత్యేవం కథితం బ్రహ్మన్ శ్రీవిద్యాసార ముత్తమమ్॥

తా॥ ఆయా ఫలముల నొసంగుటవలన ఆయా పేర్లు విశేషముగ చెప్పబడుచున్నవి. అని ఇట్లు శ్రీ బ్రాహ్మణోత్తమా! ఉత్తమమగు శ్రీవిద్యాసారము చెప్పబడినది.

శ్లో॥ యచ్ఛ్రుత్వా లభతే కామాన్ సద్యో మంత్రవిశారదః
దురితాని ప్రణశ్యంతి శలభా ఇవ పావకే॥

తా॥ మంత్రసాధకుడగువాడు ఏ మంత్రములను విని వెంటనే కోరికలన్నిటిని పొందుచున్నాడో అట్టి మంత్రముల కారణమున అట్టివాని పాపములు కూడ అగ్నిలోపడిన మిడుతలవలె నాశనమై పోవుచున్నవి. హనుమన్మంత్ర ప్రభావమున పుణ్యాత్ముడగుచున్నాడు.

ఇతి శ్రీ పరాశరసంహితాయాం పరాశర మైత్రేయసంవాదే పంచముఖ హనుమన్మహామంత్రవివరణే ఆంజనేయ శ్రీవిద్యా ప్రకాశనంనామ ఏకోనషష్టితమః పటలః

షష్టితమః పటలః

# అవతార కథనము

శ్లో॥ ఖడ్గం ఖట్వాంగ శైలద్రుమపరశుగదాపుస్తకంశంఖచక్రే
పాశంపద్మంత్రిశూలంహాలముసలఘటాన్పటంకశక్త్యక్షమాలాః
దండా వా కుంత చర్మా చలిత కుశవరా పట్టిసం చాపబాణాన్
ఖేటంముష్టింఫలంవాడమరుమభిభ జేబిభ్రతంవాయుసూనుః॥

తా॥ ఖడ్గమును, మంచపుకోటిని, పర్వతమును, వృక్షమును, గొడ్డలిని, గదను, పుస్తకమును, శంఖచక్రములను. పాశమును, పద్మమును, త్రిశూలమును, నాగలిని, రోకలిని, కుండను, టంకమును, శక్తిని, అక్షమాలను, దండము, లేదా ఈటెను, చర్మమును, ధర్భపుంజమును; పట్టిసమును, వింటిని, బాణములను, డాలును, పిడికిలిని, ఫలమును, డమరుకమును ధరించు వాయు కుమారుడగు హనుమంతుని సేవించుచున్నాను.

శ్లో॥శక్తింపాశంచకుంతః పరశుమపిహాలంతోమరంఖేటకంవా
శంఖంచక్రం త్రిశూలం ముసల మసి గదాంపట్టిసం ముద్గరంచ
గాండీవం చర్మ పద్మ ద్వినద భుజవరైః ఖడ్గ మప్యాదధానం
వందేహం వాయుసూనుంసురరిపుమథనంభక్తరక్షాసుదక్షం॥

తా॥ శక్తిని, పాశమును, ఈటెను, గొడ్డలిని, నాగలిని; చిల్లకోలను, డాలును, శంఖమును, చక్రమును, త్రిశూలమును, రోకలిని, కత్తిని, గదను, అడ్డకత్తిని, ఇనపగుదిని. ధనస్సును, చర్మమును, పద్మమును, ద్వినదమును, ఖడ్గమును, శ్రేష్ఠమగు భుజములతో ధరించునట్టి రక్కసుల

జంపునట్టి భక్తులరక్షించుటలో సమర్థుడైనట్టి, వాయుకుమారుడైన హనుమంతునకు నేను నమస్కరించుచున్నాను.

శ్రీ మైత్రేయః:-

శ్లో॥ అవతారాః కథం బ్రహ్మన్ కతి నామాని మారుతేః
గుణాశ్చ కతి సంఖ్యాకా భక్తదుఃఖాబ్ధి తారకాః॥

తా॥ మైత్రేయులవారడుగుచున్నారు. ఓ బ్రాహ్మణోత్తమా! హనుమంతుని యవతారము లెట్లేర్పడినవి? మారుతికి గల పేర్లెన్ని? భక్తులను దుఃఖసముద్రము దాటింపజాలిన గుణములాతనికి ఎన్నికలవు?

శ్లో॥ కే వా ఉవతారాః భక్తానాం ఉపాస్యాః ఫలదాయకాః
వృత్తిశ్చ కీదృశీ తస్య సర్వాం వద పరాశర!॥

తా॥ ఏ అవతారములు భక్తులకు ఫలము లొసంగజాలి ఉపాసింప దగినవిగానున్నవి! ఆ హనుమంతుని ప్రవృత్తి యెట్టిది! ఓ పరాశరమహామునీ! అంతయు చెప్పవలసినది.

శ్రీ పరాశరః:-

శ్లో॥ గుణావతార నామాని సుబహూని హనూమతః
బ్రహ్మాండవ దనంతాని విద్ధి మైత్రేయ! తత్త్వతః॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు. ఓ మైత్రేయా! గుణములు, అవతారములు, పేర్లు హనుమంతునకు పెక్కుకలవు. తత్త్వరూపమున బ్రహ్మాండములవలె వాని ననంతములుగా నెరుగుము.

జంపునట్టి భక్తులరక్షించుటలో సమర్థుడైనట్టి, వాయుకుమారుడైన హనుమంతునకు నేను నమస్కరించుచున్నాను.

శ్రీ మైత్రేయః:-

శ్లో॥ అవతారాః కథం బ్రహ్మన్ కతి నామాని మారుతేః
గుణా శ్చ కతి సంఖ్యా కా భక్త దుఃఖాబ్ధి తారకాః॥

తా॥ మైత్రేయులవారడుగుచున్నారు. ఓ బ్రాహ్మణోత్తమా! హనుమంతుని యవతారము లెట్లేర్పడినవి? మారుతికి గల పేర్లెన్ని? భక్తులను దుఃఖసముద్రము దాటింపజాలిన గుణములాతనికి ఎన్నికలవు?

శ్లో॥ కే వా ఉవతారాః భక్తానాం ఉపాస్యాః ఫలదాయకాః
వృత్తి శ్చ కీదృశీ తస్య సర్వాం వద పరాశర!॥

తా॥ ఏ అవతారములు భక్తులకు ఫలము లొసంగజాలి ఉపాసింప దగినవిగానున్నవి! ఆ హనుమంతుని ప్రవృత్తి యెట్టిది! ఓ పరాశరమహాముని! అంతయు చెప్పవలసినది.

శ్రీ పరాశరః:-

శ్లో॥ గుణావతార నామాని సుబహూని హనూమతః
బ్రహ్మాండవ దనంతాని విద్ధి మైత్రేయ! తత్త్వతః॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు. ఓ మైత్రేయా! గుణములు, అవతారములు, పేర్లు హనుమంతునకు పెక్కుకలవు. తత్త్వరూపమున బ్రహ్మాండమువలె వానిననంతములుగా నెరుగుము.

తా॥ ఈ విషయమునసే ఈ పురాతనమగు ఇతిహాస మును చెప్పెదరు. దీనిని వినినమాత్రముననే ప్రాణికి జన్మ సార్థకమగును.

శ్లో॥ పురా బ్రహ్మ మహోత్సాహ శ్చతుర్ముఖ ఇతి శ్రుతః
మారుతిం వింశతిభుజం ఉపాస్యాపి ప్రజాపతిః॥

తా॥ పూర్వము చతుర్ముఖుడగు బ్రహ్మ మహో త్సాహమున ఇరువదిచేతులు కల హనుమంతుని పూజించి ప్రజాపతియయ్యెను.

శ్లో॥ కపిలస్తు మహాతేజాః కపిలో వేదపారగః
చతుర్భుజ హనూమన్త ముపాస్యాపి ద్విముక్తిదః॥

తా॥ మహాతేజ స్సంపన్నుడు, వేదములు సాంత ముగ చదివినవాడు నగు కపిలుడు నాల్గుభుజములుకల హను మంతుని ఉపాసించి ఇహపర సాధకుడయ్యెను. ఇది ఇరువది యవ పటలమున చూడదగినది.

శ్లో॥ విజయస్తు మహాశూరః క్షత్రియో లోకపాలకః
ప్రసన్నహనుమ ధ్యానా త్సంసురాబ్ధి మతీతరత్॥

తా॥ మహాశూరుడు, క్షత్రియుడు, లోకపాలకుడు అగు విజయుడు ప్రసన్నాంజనేయుని ధ్యానించి సంసారసాగ రమును దాటెను. ఈ గాథ పదునైదవ పటలమున గలదు.

శ్లో॥ విభీషణసుతో నీలః సతతం సాధుపూజితః
పంచవక్త్ర హనూమంత ముపా స్యాసీ త్సమృద్ధిభాక్॥

తా॥ ఎల్లప్పుడు సాధువులచే పూజింపబడు విభీషణ సుతుడైన నీలుడు పంచముఖాంజనేయుని ఉపాసించి సర్వస మృద్ధినందెను. ఈ గాథ ఐదవపటలమున చూడదగినది.

శ్లో॥ ఉపాస్య వానరాకారం గాలో నామ వనేచరః
ప్రాప్తవాన్ పరమాం సిద్ధిం ఆరోగ్యప్రముఖా మపి॥

తా॥ గాలుడను వనచరుడు వానరరూపుడగు హనుమంతు నుపాసించి ఆరోగ్యమును గొప్పగాపొంది ఉత్తమ సిద్ధినందెను. ఈ గాథ పదునొకండవపటలమున చూడదగినది.

శ్లో॥ ధ్వజదత్త స్తు విప్రేంద్రః సర్వశాస్త్ర విశారదః
సువర్చలాహనూమంత ముపాస్యధనికో ఽభవత్॥

తా॥ సర్వశాస్త్ర విశారదుడగు ధ్వజదత్తుడను బ్రాహ్మణశ్రేష్ఠుడు సువర్చలాంజనేయుని ఉపాసించి ధనికుడయ్యెను. తొమ్మిదవ పటలమునందు ఈగాథ కలదు.

శ్లో॥ మైందో వేదవిదాం శ్రేష్ఠః ధ్యాత్వా వై వీరమారుతిం
తీర్ణో నౌకాం పరిన్మధ్యే బహుఛిద్రాం సవిస్మయమ్॥

తా॥ మైందుడను శ్రేష్ఠ వేదవిదుడు వీరహనుమంతుని ధ్యానించి నదీమధ్యమున పెక్కురంధ్రములతో దెబ్బతిన్న ఓడతో ఆశ్చర్యకరముగ నదినిదాటి ఒడ్డుకుచేరెను. ఈగాథ ముప్పదియైదవ పటలమున చూడదగినది.

శ్లో॥ రాజ్యభ్రష్టగతాశంకో భూయో రాజ్య మవాప హ
సోమదత్తో మహారాష్ట్రే ద్వాత్రింశద్భుజ మారుతేః॥

తా॥ రాజ్య భ్రష్టుడై భయమందిన్నయు సోమదత్తుడను మహారాజు ముప్పదిరెండుభుజముల హనుమంతు నారాధించుటవలన మరల రాజ్యమునందెను. ఈగాథ నాల్గవ పటలమున చూడదగినది.

శ్లో॥ ఉపాస్యాఽష్టా దశభుజం హనూమంతం మహాప్రభుం
లేభే పరమలోభిత్వం దూర్వాసో లోకవిశ్రుతః॥

తా॥ పదునెనిమిది భుజములుకల మహా ప్రభువగు హనుమంతు నుపాసించి దూర్వాసుడు పరమ లోభివలె సమున్ద్రమంత త్రాగి జగద్విఖ్యాతి నందెను.

శ్లో॥ ఏవం బ్రహ్మర్షయో హ్యన్యే తథా రాజర్షయః పరే
ఉపాస్య నవరూపాణి లేభిరే స్వాన్మనోరథాన్।

తా॥ ఈ రీతిగా ఇతర బ్రహ్మర్షులును, అటే అన్య రాజర్షులును హనుమంతుని నవవిధము లగు రూపముల నుపాసించి తమ తమ కోర్కెల నెరవేర్చుకొనిరి.

శ్లో॥ ద్వాభ్యాం హనూమతో భక్తి స్సమంతా ద్భక్తరక్షణః
శిష్టానాం పాలనం హ్యాద్యం ద్వితీయం దుష్టమర్దనమ్॥

తా॥ హనుమంతుని భక్తితో సమానముగనే భక్తరక్షణము జరుగును. హనుమంతుని రెండుచర్యలందు మొదటిది శిష్టులను రక్షించుట; రెండవది దుష్టులను సంహరించుట.

శ్లో॥ అన్య ద్రహస్యం వక్ష్యామి లోకానా ముపకారకం
సర్వేషా మేవ మంత్రాణాం అంగా న్యాహు శ్చ షోడశ।

తా॥ లోకముల కుపకారకమగు వేఱొక్క విశేష మును చెప్పుచున్నాను. అన్ని మంత్రములకును పదునారు అంగములు చెప్పుదురు.

శ్లో॥ కీలకం శక్తి బీజంచ ధ్యానం ముద్రా ఋషి స్తథా
ఛందో దైవత సంధ్యా శ్చ తర్పణం హవనం తథా
ఆస్తరణ మానస న్యాసం పురశ్చరణ పల్లవాః॥

తా॥ అవి 1. కీలకము, 2. శక్తి, 3. బీజము, 4. ధ్యానము, 5. ముద్రలు, 6. ఋషి, 7. ఛందస్సు, 8. దైవము, 9. సంధ్యలు, 10. తర్పణము, 11. హోమము, 12. ఆస్తరణము, 13. మానసం, 14. న్యాసము, 15. పుర శ్చరణ, 16. పల్లవములు.

శ్లో॥ పున ర్విశేషం వక్ష్యామి లోకానాం జాతకామ్యయా
యస్య శ్రవణమాత్రేణ జనస్సద్యస్సుఖీభవేత్॥

తా॥ లోకమున మేలొనర్చు కోర్కెతో ఇంకొక విశేషమును చెప్పుచున్నాను. దీనిని వినుటవలననే మనుజుడు వెంటనే సుఖవంతుడగును.

శ్లో॥ శృంఖలాబంధ మోక్షార్థీ మంత్ర మేవం పఠేద్బుధః
సద్యో విమోక్షణం తస్య భవత్యేవ న సంశయః।

తా॥ సంకెలల బంధమునుండి బయటపడ నెంచిన సద్గుణు డీ మంత్రమును పఠింపనగును. ఆతనికి వెంటనే నిస్సం దేహముగ బంధనము తొలగును.

శ్లో॥ త్రిధా మంత్రం వదేదాద్యం తథైవాంతే త్రిధా పునః
సకృత్సాధ్యం భవేన్మధ్యే తద్విద్యాత్సర్వతో భృశమ్॥

తా॥ ముందుగా మంత్రమును మూడుమారులు చెప్పవలెను. అట్లే చివఱను మరల మూడుమారులు చెప్పవలెను. ఎప్పుడైన మధ్యలో వీలైనచో అంత మిక్కిలి చేయవలెను.

శ్లో॥ సర్వోపసర్గ శమనం మహామృత్యు నివారణం
సర్వసౌభాగ్య జననం మృతానా మమృతప్రదమ్॥

తా॥ సమస్తములగు ఆపదలను పోగొట్టునది, మహామృత్యువును నివారించునది సర్వసంపదలను కల్గించునది, చావు సమీపించినవారికి అమృతప్రదమైనదియును.

శ్లో॥ ఆద్యాంతే తథామంత్రం ద్విర్వారం సంప్రయోజయేత్
సాధ్యనామం సకృన్మధ్యే గర్భస్థం చ తదుచ్యతే॥

తా॥ ఆద్యంతములందు అట్లు మంత్రమును రెండు పర్యాయములు ప్రయోగించవలెను. ఎప్పుడైన మధ్యమునను లోపల దానిని చెప్పవలెను.

శ్లో॥ మారణో చ్చాటనం వశ్యం ప్రయుక్తం కామయే నృణాం
గతి ర్జిహ్వా గర్భ బుద్ధి పాదయో స్తంభనం మతమ్॥

తా॥ మారణము, ఉచ్చాటనము, వశ్యములు, గతి, జిహ్వా, గర్భ, బుద్ధి, పాదములకు స్తంభనములును, కోరుకొను నరులకు చెప్పబడినది.

శ్లో॥ నమోఽస్తు తే వాయుసుతాంజనేయ!
నమోఽస్తు తే శ్రీహనుమన్మహాప్రభో!
నమోఽస్తు తే వానరవీర నిత్యం
నమోఽస్తు తే రాఘవముఖ్యభక్త!॥

తా॥ ఓ వాయుసుతుడవగు ఆంజనేయా! నీకు నమస్కారము ఓ శ్రీహనుమన్మహాప్రభో! నీకు నమస్కారము. ఓ వానరవీరా! నీకు ప్రతినిత్యము నమస్కారము ఓ రాముని యొక్క ముఖ్యభక్తుడా! నీకు నమస్కారము.

శ్లో॥ అన్యం విశేషం వక్ష్యామి శృణు మైత్రేయ తత్త్వతః
మహాత్మా మేన మన్త్రాణాం శేషాంచి న్మత భేదతః॥

తా॥ ఓ మైత్రేయా! వేఱొక విశేషమును చెప్పుచున్నాను. జాగరూకుడవై వినుము. మహా మంత్రములందే కొన్నిటికి మత భేదము ననుసరించి-

శ్లో॥ ఆద్య మే వాక్షరం బీజం మధ్యస్థం కీలకం భవేత్
అంత్యంపదం తు శక్తిస్స్యా దితి మంత్రవిదోవిదుః॥

తా॥ మొదటి యక్షరమే బీజమగును. మధ్యనున్న యక్షరము కీలకమగును. చివరిపదము శక్తియగును అని మంత్రవిదులు తెల్పుదురు.

శ్లో॥ అనేషాం చైవ మంత్రాణాం బహిర్భూతాక్షరాణి చ
భవంతి భూయో విజ్ఞేయాః బీజ కీలక శక్తయః॥

తా॥ ఇతరమగు కొన్ని మంత్రములకు మంత్రగతము

లైనవికాక ఇతరబహిర్యాభ్యంతరములును బీజము, కీలకము. శక్తియగుచున్నవని తెలిసికొనదగినవి.



శ్లో॥ ఆచార్యస్యాఽపి శిష్యస్య సూర్యచంద్రపరాగయోః
మంత్రోపదేశే దారిద్ర్యం భవేత్సప్తసు జన్మసు॥

తా॥ సూర్యగ్రహణము చంద్రగ్రహణము లందు మంత్రోపదేశము చేసినచో గురువునకు; శిష్యునకును ఏడు జన్మలందు దారిద్ర్యము సంభవించును



శ్లో॥ సప్తకోటి మహామంత్ర విషయేఽయం నిషేధభాక్
శాబరాణాం తు మంత్రాణాం గ్రహణేన నిషిద్ధతా॥

తా॥ ఈనిషేధవిషయము సప్తకోటి మహామంత్రము లందును గ్రహింపదగినదే శాబరమంత్రములకు మాత్రము గ్రహణమున నిషేధములేదు.



శ్లో॥ న కాలనియమస్తత్ర న దేశనియమోఽపి వా
శాబరేష్వేవ మంత్రేషు ఇతి శాతాతపోఽబ్రవీత్॥

తా॥ శాబరమంత్రముల విషయమున కాల నియమముకాని ప్రదేశనియమముకాని లేదని శాతాతపుడుపల్కెను.

శ్లో॥ ఋషిః ఛందాంసి మంత్రాణాం ఏషాం స్ఫుటతరాణి న
ఋషిస్త్వేషాం భవేద్బ్రహ్మా గాయత్రీ ఛంద ఇష్యతే॥

తా॥ ఈ మంత్రములకు ఋషిచ్ఛందములు స్పష్టమైనవే. వీనికి ఋషిబ్రహ్మ. ఛందస్సు గాయత్రిగా తెలియబడుచున్నది.

* *

ఇతి శ్రీ పరాశర సంహితాయాం

పరాశర మైత్రేయ సంవాదే

పంచముఖ హనుమన్మహామంత్రవివరణే

అవతారకథనంనామ

షష్టితమః పటలః

